# విజ్ఞాపనము.

లోకమాన్య బాలగంగాధరతిలకమహారాజు వేదశాస్త్రశ్రౌతాది మహావిద్యావిశారదుఁడు. లోకజ్ఞుఁడు. వైదికాచారనిష్ఠాగరిష్ఠుఁడు. దేశభక్తాగ్రేసరుఁడు. స్వార్థపరిత్యాగి. పరధనపరదారదూరుఁడు. పరమోత్తముఁ డాతనికీర్తి సర్వలోకములందును బొందుపడి యున్నదని చెప్పట నతిశయోక్తి కానేరదు. నేను వారి దర్శనము చేసి భజించు భాగధేయము గలుగనివాఁడనైనను వానిమహామహత్త్వ మెఱింగినవాఁడ నగుటం జేసి భగవంతునియందు వలెనే వానియందు భక్తి చేసి యనేక సందర్భములందు సంస్కృతాంధ్రపద్యరత్నంబు లర్పించి పూజించి యున్నవాఁడ. ఈనడుమఁ బూనానగరంబునకుం బోయి దర్శింప నెంచితిని గాని యంతలో నతండు పరమపదంబు నొందెననువార్త నాచెవుల కశనిప్రాయ మయ్యె. అయ్యెడఁ గొన్నిపద్యములు రచించి రాజమహేంద్రవరసభలో నావిషాదమును వెల్లడించితిని. దేశీయసోదరు లెల్లరును తిలకస్మారకచిహ్నము లనేకరూపంబులం జేయుట లెఱింగి నేను నుడుతభక్తిగా నొకచిహ్నము నెలకొల్పఁ గలనో యని విచారించి వాని చరిత్ర మాచంద్రతారార్కస్థాయిగా జగం బెఱుంగుచుండు నట్లొక గ్రంథము వ్రాయఁదలంచి శ్రవ్యకావ్యముకన్న దృశ్యకావ్యము సర్వోత్కృష్ట మని నిశ్చయించి యీరూపకము చేయుటకుం దొడంగి యిట్లు పరిసమాప్తి నొందించితిని. ఇందు భగవానునిజన్మము మొదలుకొని జన్మాంతరమువఱకుం గలచిత్రచరిత్ర మంతయు నింతింతగా నభివర్ణించితిని.

కథానాయకుఁడు ధీరోదాత్తుఁ డుత్తమచరిత్రుఁడు. అయి గొన్నికొన్నిస్థలములందు నాటకలక్షణంబులకు భం[illegible]టువాటిల్లె సందర్భములు పట్టినవి. మరణముతో నాటకము సమా[illegible] ప్రాచీనసాంప్రదాయము కాదు. కాకున్న [illegible] చాల వలసివచ్చినది. దానం జేసియే భరతవాక్యమునకుఁ జోటు లేకపోయినది. పట్టాభిషేకప్రాయ మైనషష్టిపూర్త్యుత్సవముతోఁ గథ ముగించినయెడఁ బైదానికిఁ జోటుండును. మూఁడవయంకములో నన్యదేశస్థుల కపభ్రంశ ముపయోగింపమి గౌరవార్థ మని యెఱుంగునది. భగవానుఁ డింగ్లాండు నకుఁ బోయి చేసినమహాకార్య మొకయంకముగాఁ జేయఁ దగినదియే. కాని నాటకము పదియంకములకన్న మించి యుండ రాదని సూత్ర ప్రాయము చేసితిని. దీనికిఁ బాఠకమహాశయులు మన్నింతురుగాక. నా కీనాటకరచనాకాలమున ననేకహూణగ్రంథములలోని విషయములెల్లఁ గోడీకరించి బోధించుచు శ్రీయుత గజవల్లి రామచంద్రరావు, యం. ఏ గారు మిక్కిలిసాయ మొనరించిరి. వారియెడ నే నెప్పుడుం గృతజ్ఞుఁడ. అచిరకాలములో నీనాటకము రచించి ముద్రింపించుటకు నన్నుఁ బ్రోత్సహించిన శ్రీకుర్తివెంటి నాగేశ్వరరావుగారికిని ముద్రణాకార్యమున కొకవిధముగా ధనసాహాయ్యము చేసిన శ్రీనాళము సోమరాజుగారి వేంకటరత్నముగారికిని నామనఃపూర్వకాశీర్వాదనము లర్పించుచు నింతటితో విరమించుచున్నాను.

గ్రంథకర్త.

శ్రీరస్తు.

# తిలక మహారాజ నాటకము.

నాంది.

శా. నానాద్వీపవతీవతంసముల నానా నారత్నజాలంబులన్
నానాసస్యములన్ మహామహుల నానా వీరులన్ ధీరులన్
నానావిద్యల గర్భమందుఁ గని నానా దేశశస్త్రోన్నతా
నూనాత్మప్రతిభం దలిర్చుమనహింద్ దూమాతకున్ మ్రొక్కెదన్.

నాంద్యంతమున

సూత్రధారుఁడు—ఓహో! యేమి నాయదృష్టము! జాతీయవాదులలో నగ్రగణ్యులును, దేశభక్తాగ్రేసరులును, లోకమాన్యులును, మహామహులు నగుమహారాష్ట్రతిలకుల దివ్యచారిత్రం బాతయు రూపకరూపంబునం బ్రదర్శింప నాజ్ఞాపింపఁబడితిని. దీనం జేసి నేనునుం గొంత దేశసేవ చేసినపుణ్యంబునం బోవువాఁడ నగుదును గదా! (రెం డడుగులు వైచి తెరవంకఁ జూచి) ప్రేయసీ! యేమిచేయుచుంటి? వైకమా ఆ[illegible]రా!

నటి—శ్లో. "సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం
సస్యశ్యామలాం, మాతరం॥
శుభ్రజ్యోత్స్నా పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం।
సుహాసినీం సుమధుర భాషిణీం।
సుఖదాం వరదాం మాతరం॥
త్రింశత్కోటికంఠకలకల నినాదకరాళే

ద్వాత్రింశత్కోటి భుజై ర్ధృతఖరకరవాలే
కథయంతి జనాస్త్వాం కథం మాతరబలాం।
బాహుబలధారిణీం నమామితారిణీం॥
రిపుదళవారిణీం మాతరం॥ ”

(అని పాడుచుఁ బ్రవేశించుచున్నది.)

సూత్ర—(తనలో) ఆహా! నే నొక్క దేశభక్తాగ్రేసరుని పవిత్ర చరిత్రం బాతయు నేఁడు నాటకీ మాడం దలంచి యుండ నాభార్య యిట్లు దేశభక్తిం బ్రేరేచుచుం బాట పాడుచు వచ్చుచున్నది. ఏమి నాభాగధేయము!!

నటి—(సమీపించి) ఆర్యా! నమస్కారము. దాసురాలి కేమి యాజ్ఞ?

సూత్ర—దేవీ! నేఁ డొక్క దేశభక్తుని దివ్యచారిత్రం బెల్లఁ బ్రదర్శించి యీసభాస్తారుల నానందవార్ధి నోలలాడింపఁ దలంచి నిన్నుం బిలిచితిని.

నటి—అసంఖ్యాకములైనపురాతనరాజర్షి పుణ్యచరిత్రంబులుండ సామాన్యం డగునొక్క దేశభక్తుని చారిత్ర మీసదస్యులమది కెక్కఁ గలదా?

సూత్ర—ఓసి వెఱ్ఱిదానా! పురాతనరాజర్షి చరిత్ర మన్న నూడిపడ్డ దనుకొంటివా యేమి? విను:—

మ. సుపరిష్కారముగా సమస్తకళలున్ శోధించి బోధించి స్వా
ర్థపరిత్యాగము చేసి దేశమునకున్ స్వప్రాప్తికై ప్రాణ మె
ల్లపుడున్ పీడఁగ నుండి సర్వసముఁడై హర్షాబ్ధినాలోకమా
న్యపదప్రస్తుతుఁ డెల్లలోకములలోన్ వర్ణింపఁగా నొప్పుఁడే. ౨

అట్టివానికన్న పురాతనరాజర్షి పూజ్యుం డని నాయభిప్రాయము కాదు, ఈసభ్యులయభిప్రాయమును గాదు.

నటి — సరే! అట్టిదేశభక్తుఁ డెవ్వఁడు? ఎవనిచరిత్రము నేఁడు ప్రదర్శింపఁబడును?

సూత్ర — లోకైకమాన్యుం డగునాధన్యాత్ముఁ డెవ్వఁడో యెఱుంగవా? చెప్పెద వినుము—

సీ. ఎవ్వఁ డర్వదియాఱు నేఁడు లీధరణికిఁ,
దిలకంబుగా నుండి తేజుఁ గనియె
నెవ్వఁ డీపుడమిలో నెందఱే విద్యార్థు,
లను గృతార్థులఁ జేసి ఘనత మీఱె
నెవ్వఁడు విద్యార్థి కేడ్పుఁ డయ్యును రాజ,
కీయపదం బిచ్చఁ జేయఁ డయ్యె
నెవ్వఁడు సతతంబు హిందుదేశాభివృ,
ద్ధికిఁ బాటుపడుచును దేహ మిచ్చె.
తే. నెవఁడు లోకమాన్యుఁ డయి యెసక మెసఁగ
నెవఁడు మకుటంబు లేనిమ హీశుఁ డయ్యె
నమ్మహాత్ముఁడు రామచం ద్రాత్మజుండు
బాలగంగాధరుఁడు లోక పావనుండు. 3

నటి — ఓహో! తిలకమహారాజచరిత్రమా! అది రామ కృష్ణాదులచరిత్రమునకన్న మిన్న యనవచ్చును. కాని యది రూపక రూపంబునం గన్పట్టుచున్నదియా?

సూత్ర — లేక యేమి? విను—

తే. సృష్టికిం బ్రతిసృష్టినిఁ జేసి వాసిఁ
గొన్న కౌశికమునిరాజు గోత్రమందు
వేంకటాధ్వరిపుత్త్రుఁడై వెలసినట్టి
కృష్ణకవిరాజు తెలుపఁ దత్కృతికిఁ గర్త. ౪

నటి — ఆహా! అట్లయినచో మనము కృతార్థులమే.

మత్తకోకిలము.

పిండియారఁగ విప్పినట్టులు పెద్దవెల్గున వెల్గుచున్
బండువెన్నెల భూతలంబునఁ బర్వి కాయుచునుండ నీ
నిండుపున్నమ రేయి యంతయు నిల్వ కేగెడుదాక మా
ర్తాండు రాకకు వేఁచి నాటక మాడ ప్రోడిమిఁగాంచుమా.

సూత్ర—కాంతా! నేను వసంతమును గీర్తింతు ననుకొనుచుండ వీరరసోద్బోధకం బగుశరత్తును గీర్తించితి వేమి? మనము ప్రదర్శించునాటకము వీరరసప్రధానమా? ప్రధాన మైనను దాని నెట్లు ప్రదర్శింపఁ గలము?

నటి—వీరరసమే ప్రదర్శింప లేనియెడల మీ కీలోకంబున గౌరవం బెక్కడ? ప్రకాశం బెక్కడ?

సూత్ర—

సీ. శూరాగ్రగణ్యుఁడై వైరులఁ దెగటార్చి,
ప్రతిభఁ గన్నశివాజి పార్థివుండు
కటకాదులను గెల్చి కవులసన్నిధిఁ బేర్మి,
నందినకృష్ణరా యప్రభుండు
బంగారువర్షంబు రంగారఁ గురిసి పే,
రెన్నికఁ గొనుకాక తీశ్వరుండు
ఢిల్లిసుల్తాను నో డించి పేరందిన,
ఘనుఁ డల్లమంత్రియు గంధరుండు.

తే. గీ. భోజుఁడును విక్రమార్కుఁడు రాజరాజు
శాలివాహనుఁడుం దొట్టి శౌర్యనిధులు
లేనియిక్కాలమందు నో లేమ! మనకు
వీర మెక్కడ వచ్చు నీ భారతమున.

మనమే కాదిప్పుడీభరతవర్షంబునం గలవారెల్లఁ బిఱికిపందలే. దేశాభివృద్ధిం గోరినస్వార్థపరిత్యాగి యొక్కఁడును గానరాఁడు. ఇట్టిచో నీస్థితిపోయి నట్లున్నయీదేశంబునకు గౌరవం బెక్కడ? ప్రకాశం బెక్కడ?

(తెరలో) ఓరోరి దేశద్రోహి! యెవఁడురా నీవు? భరతమాతకు గౌరవంబును బ్రకాశంబును లేదని ప్రేలుచుంటివి! ఎల్లరును నీకంటికి స్వార్థపరాయణులును, పిఱికిపందలునే కనుపించుచుండిరిరా?

సూత్ర—దేవి! వింటివా? నేను సామాన్యముగా నన్న మాటకుం గోపించి బాలగంగాధరతిలకుండ యిట వచ్చుచున్నవాఁడు. ఎటుపోయి యెటువచ్చునో పోవుదము రమ్ము.

ఇద్దఱు—(నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

## ప్రథమాంకము.

[అంతట నీవాక్య ముచ్చరించుచు బాలగంగాధరతిలకుండును, అనుసరించి యాగరుకారు చంద్రవార్కరులును ప్రవేశము.]

తిల—హా! హా! దేశద్రోహియయి శైలూషాధముఁ డెట్లు ప్రేలుచున్నాఁడో చూచితిరా?

ఆగ—పామరు లెట్లాడుకొన్న నేమి? ఎవ్వఁడో శైలూషాధముం డాడినంతమాత్రన మన భారతమాత వీరమాత గాకపోవునా? విను—

సీ. రామకృష్ణాదీశ్వరవరాంశసంభవుల్,
ప్రహ్లాదశుకముఖభక్తవరులు
కాళిదాసాదిసత్కవిరాజచంద్రులు,
శంకరాదిమతసంస్కారగురులు
పాణినిప్రముఖశబ్దప్రపంచజ్ఞులు,
జనకరాజాదివిజ్ఞానఘనులు
శిబికర్ణముఖదాతృశేఖరులును వివే,
కానందముఖ్యమహామహులును

తే. గీ. త్యాగరాజాదిగానవిద్యావిశార
దులు మహాత్ములు పెక్కండ్రు తొల్లి హిందు
మాత గన్నట్టిబిడ్డలు భూతలమున
నెందఱో కల రిప్పుడు నెంచి చూడ. ౭

తిల—భరతమాత గొడ్డుపోయి యున్న దన్నందులకు మాత్రము నాడెందము కొందలం బందుచున్నది సుమీ!

ఆగ—అనామకులమాట కింత యేమిటికిఁ బోనిమ్ము. కార్యమ్ము దెసవాఁడవు కమ్ము.

తిల—(శాంతించి) మిత్రమా! నన్నుఁ గార్యంబు దెసవాఁడవు కమ్మంటివి. నే నెట్టికార్యంబు చేసి భారతంబు సేవింతునా యని యెప్పుడును జింతించుచుండెదనుగాని, యిప్పు డీనాటకునిమాట విన్నది మొదలుకొని మముబోంట్లఁ గన్న భరతమాత వీరమాతయయి యెట్లు సుఖించునో యని పరిపరివిధంబులఁ బరితపించుచున్నవాఁడ. నాపరితాపంబునకుఁ బారంబు గలుగునో లేదో?

ఆగ—"కృషితో నాస్తి దుర్భిక్షం" అనున్యాయంబునఁ బ్రయత్న మెప్పటికిని విఫలంబు గాదు.

తిల—(ఆలోచించి) ఆగరుకారూ! నీవు న్యాయశాస్త్ర పరీక్షం గృతార్థుఁడ వైనవెనుక నేమి చేయుదువు? దొరతనమువారి కూడిగము సేయ నెంతువా?

ఆగ—సేవకుఁడనై పరిచర్యమాత్రము చేయ నొల్లను. నీ వేవృత్తి యందుఁ బ్రవేశించెదవు?

తిల—పరాధీనవృత్తి నే నెన్నటికి నవలంబించువాఁడ గాను.

ఆ. వె. పొట్టకూటికొఱకుఁ బెట్టల కొడలమ్మి
సేవ చేసి బ్రదుకు జీవికంటె
నేవ మైనవిట్టి జీవించుపురు వయి
పుట్టు టయినఁ గొంత పోలు గాదె. ౧

ఆగ—అవు నది యట్టిదే.

ఆ. వె. ఒరుల కూడిగంబు నొనరింపఁ గుదిరిన
సిగ్గుమాలినట్టి క్షితిజనుండు

మాతృదేశమునకు మఱియును ద్రోహంబు
చేసినట్టివాఁడ చెప్ప నేల.

తిల—మేలు మేలు! మిత్రమా! మేలు దలంచితివి. మనము న్యాయశాస్త్రంబునం దేరి, దేశసేవ చేయుచుఁ గాలక్షేపము సేయుదము.

సీ. గంగాదితీర్థావగాహనంబునకంటెఁ
తెలియ నత్యధికంబు దేశసేవ,
హరిహరాదిసురాళియభ్యర్చనముకంటె,
తెలియు నత్యధికంబు దేశసేవ
పౌండరీకాదిసవనకాండకృతికంటెఁ,
దెలియ నత్యధికంబు దేశసేవ,
సప్తసంతానాదిశస్త్రక్రియలకంటెఁ,
దెలియ నత్యధికంబు దేశసేవ,

ఆ. అట్టిదేశసేవ యాచరించినవాని
కిహపరంబులందు నెంతయేని
సౌఖ్య మబ్బు వానిసరసఁ బాపము తల
సూప వెఱచుఁ జూవె సూరివర్య. ౧౦

ఆగ—మన మెట్టిసేవ చేసి చరితార్థులము కాఁగలము! విద్యాదానముకన్న నిపుడు సేయఁగలసేవ యొకటి యుండునా?

తిల—ఆహా! యెంతచక్కఁగా జ్ఞప్తికిం దెచ్చితివి!

శా. విద్యాదానముకన్న మిన్న యగుచుర్వి న్వేఱొండుదానం బిలన్
హృద్యంబైనది లేదు లే దనుచు వా గీశుల్ వచింత్రి ప్రజల్
విద్యాగంధ మెఱుంగకుండుటఁ గదా వీర్యంబు వోఁ దాసులై
మాద్యద్రాజపదప్రలీను లగుచు న్మా నేది యున్నా రయో.

కావున నిట నొకపాఠశాలం బెట్టి విద్యాదానము చేయుదము. అదియే మనచేయఁ దలంచినదేశసేవకుఁ బ్రథమసోపానము.

అగ — మేలు మేలు. (తిలకుం గౌఁగిలించుకొనుచున్నాఁడు.)

చంద — హాహాహాహాహా! (అట్టహాసము చేసి) ఓహో! దేశ బాంధవులారా! మీరా స్వార్థత్యాగము చేసి పరార్థప్రాపకు లగుపర మోత్తములు! మీకోరికలు గొంతెమ్మకోరికలు! మీరఁట! దేశక్షేమ మునకై పాటుపడఁ బోయెద రఁట! మీకు ద్రవ్య మెక్కడ? స్వతంత్రజీవనం బెక్కడ? మీరెక్కడ? దేశోపకార మెక్కడ? నక్క యెక్కడ? దేవలోక మెక్కడ?

అగ — పెద్దపెద్దపరుగు లెత్త లేకున్న మానె చేత నైనట్లు ఉడుతభక్తిం జూపలే కుందుమా?

తిల — ఏమియుఁ జేయలేనివాఁ డైనను దేశభక్తుఁ డైనఁజాలు. అదియే దేశోపకారము.

తే. గీ. ఎట్టియిక్కట్టు వచ్చిన నేమియయిన
ధనము నిప్పచ్చర మైన దారి చెడిన
బందిఁ బడినను దేశసే వాపరుండు
జంకు గొంకు నెఱుంగఁడు స్వాంతమందు. ౧౧

చంద — (అట్టహాసము చేసి) కానీ! మీ మనోనిరంకుశాధికార మెట్లు చేయ వలయునో యట్లు చేయక మానను. కాచుకొండు.

తిల —

ఉ. న్యాయముఁ ధర్మముఁ విడక నారతముఁ నిజదేశసేవకై
పాయనిదీక్షఁ బాటుపడు వానికి వచ్చిన నప్పు నిక్కముల్
పోయినఁ బోవు సంపదలు పుణ్యచరిత్రుఁడు వాఁడు లక్ష్యముం
జేయఁడు దేని కేనియుఁ జీవనముం దృణమట్లు లెంచెడుఁ. ౧౨

చంద — పులి యున్నదని చెప్పినను వినక పోయి దానికి వాతబడి యగువారి నెవ రేమి చేయుదురు! మీయిష్టము.మీయిష్టము

వచ్చిన ట్లుండుఁడు. అదిగో విష్ణుశాస్త్రి వచ్చుచున్నాఁడు. నేను బోయెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

[అంత విష్ణుశాస్త్రిచిపళూణకరు ప్రవేశించుచున్నాఁడు.]

ఇద్దఱు—(లేచి నమస్కరించుచున్నారు.)

విష్ణు—(ఆశీర్వదించుచున్నాఁడు.)

అందఱు—(విశ్రమించుచున్నారు.)

తిల—ఆర్యా ! మీరు దొరతనమువారిబారినుండి బైటఁబడితిరని విని సంతోషించితిమి.

విష్ణు—దైవానుగ్రహమున బైటఁబడితి నని చెప్పుటకు సంతసించుచున్నాను.

క. దైవానుగ్రహ ముండిన
నేవానియనుగ్రహం బకొ పేక్షింపఁగ నే
లావలయు దైవరక్షితుఁ
డే వేళం జెడక యుండుకొ నే మే మైనన్. ౧౩

ఆగ—అయ్యా ! మీ రీపునహాపురంబున నొకపాఠశాలఁ స్థాపింపఁ దలంచుచుంటి రఁట నిజమా ?

విష్ణు—అవును. నా కాసంకల్ప మున్నది.

తిల—మేమిరువురము నట్టికార్యమే తలపెట్టియున్నారము. ఇపుడు మనము ముగ్వురమును దానికై ప్రయత్నించి మనమనోరథముల నెఱవేర్చుకొందము.

విష్ణు—(సంతసించి) సమర్థులైనమీరు నాకుఁ దోడుపడుదుమనుచుండఁగా దందునా? సిరి రా మోకా లొడ్డువాఁ డుండునా? మనకు నామజోషియును సహకారియయి యుండఁగలఁడు. మన

మిపుడు కొన్నిపత్రికలు నెలకొల్పి తన్మూలంబున దేశక్షేమాభివృద్ధిం గావింప వలయు నని యున్నది.

తిల—మాకును బత్రికాకార్యమందుఁ బరమప్రీతి.

విష్ణు—ఆగరూ! ఆప్తిం జెప్పుచుందువు. ఆతఁడు మనకు సహకారి కాఁ గలఁడా?

ఆగ—అతఁడు మనకన్న స్వార్థత్యాగము చేసినవాఁడుగాని సామాన్యుఁడు గాఁడు. నామజోషియందు మీ కెంతనమ్మకమో ఆప్తియందు నా కంతనమ్మకము.

తిల—మన కెన్నియిక్కట్టులు వచ్చినను మన మైదుగురము పంచపాండవులవలె నేకగ్రీవముగా నుండి సర్వమునను సమానఫలభాక్కులమై పని చేయుచుందము.

విష్ణు—దేశాభివృద్ధికై పాటుపడం దలంచినవారి కనేకవిఘ్నములు వెన్నుదన్ని వచ్చుచుండును. వాని కింతయును జింతింప కుండు నది యని బోధించుచుఁ బోయి వచ్చుచున్నాను.

(అని లేచును.)

అందఱు—(లేచి నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

# తిలకమహారాజనాటకము.

## ద్వితీయాంకము.

స్థలము :— పూనాలో నొకగృహము.

[ఆప్టీయు నామజోషీయుఁ బ్రవేశించుచున్నారు.]

ఆప్టీ— కొల్హాపురముమహారాజును బరిభవించినవారిం గేసరి యందు నిష్కరుణముగ విమర్శించి వ్రాసినందులకై గదా మనతిలకు నకును, అగరుకారునకును గారాగారవాసము వచ్చినది. అయ్యో! విష్ణుశాస్త్రిచిపళూణకరు కాలధర్మము నొందె. మన మెట్లీపత్రికా కార్యములు సాగింపఁ గలమో తెలియకున్నది.

చ. మదికి విచారముం గలిగి మానరి యున్ననరుఁడు విజ్ఞుఁడై
గదిరిన వాఁడ యయ్యును బ్రకామధనాఢ్యుఁడ యయ్యు భూరిసం
పద గలవాఁడ యయ్యు నిలఁ బామరుఁ డట్లయి యెట్టికార్యముం
బొదలుప లేఁడు నిక్క మిది భూసురవర్య! యెఱుంగఁ జెప్పితిన్.

నామ— మిత్రమా! కష్టములు వచ్చినప్పుడు ధీరులగువారు ధైర్యస్థైర్యములను వీడుదురా? ధైర్యబలంబున సాధింపరాని కార్యముండునా?

ఆ. కొండ లెల్లఁ బిండి పిండిగా నొనరింప
వచ్చు వార్ధు లెల్లఁ ద్రచ్చ వచ్చు,
నింగి కెగురవచ్చు నేలలోఁ జొరవచ్చు
ధైర్యబల మొకండు దనరె నేని.

ఆప్తి.—సరికాని మనమిత్రుల కీచెఱసాల నాలుగుమాసములు. వారు వచ్చులో మనము పట్టుదలతోఁ బత్రికాకార్యము నడపించివారి మెప్పు నడయవలయును జుమీ!

నాయ.—పత్రికలో న్యాయముగ వ్రాసినందుల కన్యాయముగ మనమిత్రులు దొరతనమువారిచే శిక్షింపఁ బడి రని తెలిసి ప్రజ లెల్లరు మనకుఁ బెక్కురీతుల సాయము చేయుచు సానుభూతిం దెలుపుచున్న వారు. మన ప్రయత్నము లన్నియుఁ గొనసాగునట్లు పరమేశ్వరుఁ డను గ్రహింపనున్నాఁడు.

ఆప్తి.—తే. పత్రికాకార్యమును నాంగ్లపాఠశాల
పనులు నేను నాగరుఁ జూచుకొనుచు నుందు
మీరుఁ దిలకుండుఁ దక్కినవెల్లఁ జూచు
కొనుచు నుండఁగ వలయుఁ జూమ్మనుదినంబు. 3

నాయ.—తిలకువిద్యావిశేష మెట్టిది?

ఆప్తి.—అతఁడు సర్వసమర్థుఁడు. వానిచదివినవిద్యలం జెప్పెద వినుము.

సీ. తనతండ్రి రామచంద్రతిలకు నేర్పెను,
హారాష్ట్ర మాంగ్లేయమతని కాదిఁ
జినతండ్రి పోషణంబున నుండి యాతండు,
పట్టపరీక్షలోఁ బ్రతిభఁ గాంచెఁ
జదివి ముమ్మాపురిసర్వకలాశాల,
న్యాయశాస్త్రపరీక్ష నాటితేటి
పూరాణభాషం గల యుద్గ్రంథముల నెల్ల,
వాచోవిధేయమై వఱలఁ జదివెఁ
తే. గీ. గావ్యములు నాటకము లలంకారములును
సంస్కృతమ్మునఁ గూలంకషముగ నెఱిఁగెఁ

గలచె రసవాదశాస్త్రము గణితమందు
నద్భుతప్రజ్ఞ గలవాఁడ యయ్యె నతఁడు. ౪

మఱియును—

తే. గీ. ఋగ్యజుర్వేదములసార మెల్లఁ దెలిసె
వ్యాకరణతర్కశాస్త్రము లభ్యసించె
జ్యోతిషంబున నాతని సాటివాఁడు
లేఁడు సర్వజ్ఞుఁ డాతఁడు గాడె తెలియ. ౫

నామ—అవును. అతఁడు సర్వజ్ఞుఁడు కావుననే లోకమాన్య బిరుదంబు రా నున్నది.

ఆప్టి—లోకమాన్యబిరుదమే కాదు. మహారాజబిరుదము గూడ రా నున్నది.

నామ—ఆతఁడు కిరీటధారణము లేనిమహారా జనుటకు సందేహము లేదు. మిత్రమా! మనమిత్రులు వచ్చినపిమ్మట డక్కనుహిందూస్థానసంఘ మని యొకసంఘమును స్థాపించి యందు మనమిద్దఱ మును సర్వకాలసభ్యుల మై యుండుటయ కాక, కేల్కారును, ధారపయును, గోలును, గోకులకృష్ణుండును, భానుండును, పతంకరుండును, సభ్యులై యుండునట్లు చేసి యిట నొకసర్వకలాశాలం బెట్టి యీసభ్యు లందఱు నం దుపాధ్యాయులుగా నుండి పాటుపడునట్లు చేయఁ బ్రయ త్నింపవలయును. (పరికించి) అదిగో మనతిలకుండును నాగరుకారును వచ్చుచునే యున్నారు.

ఇద్దఱు—(లేచి యొకరొకని కౌఁగిలించుకొనుచున్నారు)

ఆప్టి—మీ రిట్లు వచ్చినందులకు మే మెంతయుఁ జింతించితిమి.

నామ—దేశక్షేమాభివృద్ధిం గోరినవారి కిట్లు వచ్చు టాశ్చర్యము కాదు. దేనికిని దైవమే ప్రమాణము.

అందఱు—(ఆసీను లగుచున్నారు)

తిల—కారాగారవాసంబున కింతయును జింత లేదు. మన కార్యముల కంతరాయ మగునో యని చింతించితిమిగాని సమర్థులైన మీ రేయింతలోపము లేకార్యమునందు లేకుండఁ జేయుటయే గాక సర్వ కలాశాలన్ స్థాపింప నెంచి చేసినపని విని పరమానందభరితుల మైతిమి సుఁడీ! మఱియు [illegible]కలాశాలకు స్థలము సేకరించి భవననిర్మాణ ప్రయత్నముం జేసి వచ్చితిమి. పెర్గూసన్ మనకుఁ గొంతసాయము చేసి యున్నాఁడుగావునఁ గలాశాలకు వానిపేరు పెట్టవలయు నని యున్నది.

క. సాయము చేసినవారిం
బాయక తత్కీర్తి జగతిఁ బర్వఁగఁ జేయన్
శ్రేయ మగుఁ బెర్గుసన్ పే
రేయెడ స్మరియింప మనకు నెంతయు నొప్పున్. ౬

నామ—అట్లే చేయుదము.

ఆగ—నాకుఁ గొంతకాలమునుండి హిందూసంఘమునం గల దురాచారములఁ దొలఁగించి మతము సంస్కరింప వలె నని యున్నది. దానికి మీ రేమి చెప్పుదురు?

తిల—కొన్నికొన్ని సంస్కరించుకొన వచ్చును గాని యిపు డీ యుద్యమము చెల్లదు. మనమతమందు దురాచారము లున్న వనిన నన్యమతస్థులు మనలఁ బరిహసింతురు. అది తగదు. మనమతము మహర్షినిర్మితము కాని సామాన్యము కాదు. ఏవో కొన్ని నెఱసు లున్న వని మత మంతయు సంస్కరింప నెంచుట కించిత్ జ్ఞలక్షణము.

చ. అమలినవస్తుసంతతు లవన్నియునుం గలఁగించి పోయఁగా
సమరినయద్దమందు నొకచోయంచున నించుక బూదె తాకినన్
సమయము చూచి చక్కఁబడఁ జల్పుకొనం దగుఁగాని దానిఁ జూ
ర్ణముగ నొనర్చి మార్విధమునం బొనరింపఁగఁ జూచు టొప్పునే. ౭

నామ—అవును నిప్పు డామతసంస్కారమునకై తలపెట్టితి మేని మనలో మనకుఁ బోరలు పుట్టుటయు మనయుద్యమములకు భంగపాటు వాటిల్లుటయుం దటస్థించును.

ఆప్టి—ఆగరుకారు చెప్పినది నామది కొప్పియున్నది. అన్యమత స్థులు నవ్వుదురని మనదురాచారముం జక్కఁబెట్టుకొనక కప్పిపుచ్చుట న్యాయమా? ఇ గెలిచినప్పుడు గదా - అచ్చు గెలుచుటకుం బ్రయత్నించుట! మనమతమునే మనము బాగుచేసికో లేనియెడల నన్యమతముల నెట్లు బాగుచేయుదుము? దేశము నెట్లుద్ధరింతుము?

ఆగ—ఇపుడు మతసంస్కారమునకై మీరు పూననియెడల మీతో సంబంధము వదలుకొని మీపత్రికలజోక్యమునకుం బోక మఱియొకపత్రికఁ బ్రకటించుకొందుము. (ఆప్టితో లేచిపోవుచున్నాఁడు)

తిల—(నామజోషిం జూచి) నాయభిప్రాయమును గ్రహింపలేక ఆగరుకా రింతవ్యగ్రుఁడై వెడలిపోయెఁ జూచితివా?

నామ—అతఁడు మొదటినుండియుఁ బూర్వాచారములం దిరస్కరించువాఁడే.

క. చిందులు ద్రొక్కుచు నెప్పుడు,
తొందరపడువాని చెలిమి తొలఁగిన యేని
మందులకు వందురం దగు,
నుమారుగాఁ దగునె జ్ఞానవంతుల కెందున్. ౮

తిల—అతఁడు మనతో విడిపోయి సుధాకరపత్రికను స్థాపించుకొను నని నాకుఁ దెలిసినది. ఇపుడు మనయాంగ్లపత్రికకుఁ గేల్కారునిసంపాదకునిగాఁ జేసి మనము ముద్రాయంత్రాదికార్యములు చక్కఁబెట్టుకొనుచుందము. మఱియు నేను ధర్మశాస్త్రమును బోధించుపాఠశాలం బెట్టి తత్పరీక్షకుఁ బోవువారి కుచితముగ విద్య గఱపుచుందును.

ఆ. మనువు చెప్పినట్టిమార్గంబులును యాజ్ఞ
వల్క్యుఁ డాడినట్టివాక్యములును
దేటతెల్లముగను దెలియఁ జెప్పినధర్మ
శాస్త్రవేత్త లగుచుఁ జనుదు రెల్ల.

నామ—నీవు సిద్ధసంకల్పుఁడవు. నీతలంచినది కాకున్నది లేదు. శ్రీమహావిష్ణువు ధర్మసంస్థాపనార్థ మపుడపు డిట్లు పుట్టుచుండును. నీవు ట్టినవంశంబును. బరమపవిత్ర మైనపీష్వాలవంశము గదా! హా! హా!

మ. ధనవంతుల్ గుణవంతుల్ విమలవిద్యావంతుల్ దాంతుల్
ఘనబాహాబలవంతుల్ సకలలోకఖ్యాతశౌర్యోజ్జ్వల
త్వనితస్వాంతులు ధైర్యవంతులును మేధావంతుల్ శాంతుల్
వినుతానంతయశోర్థవంతు లగునాపీష్వాలు సామాన్యులే. ౧౦

(తెరలో)

మత్త. మంచివాఁడును మంచియుంగొఱ మాలె మాలఁడుపూజ్యుఁడై
సంచరించుచు నుండె సత్య మసత్యమట్లయిపోయె ను
క్కించుకంతన చచ్చు నుత్తముఁ డేండ్లు పూండ్లుగ దుష్టు జీ
వించుఁ గాలము కానిదై కనిపించుచుండె నిఁకే మనన్. ౧౧

నామ—(ఆకర్ణించి) కేల్కారుమాట వినవచ్చుచున్నది. ఆతఁడు వచ్చుచుండఁబోలు చూడుము.

ఇద్దఱు—(అటుచూచుచున్నారు.)

కేల్కారు—(పైపద్యమును జదువుచుఁ బ్రవేశించుచున్నాఁడు)

తిల—కేల్కార్! ఏమియిట్లు వ్యగ్రుండవై యుంటివి విశ్రమించి చెప్పుము.

కేల్కార్—(విశ్రమించి) ఈనడుమ దుష్టుఁ డెవ్వఁడో చేసినహత్య వినియుంటిమి కదా! ప్లేగువిషయమై మనపత్రికలో వ్రాసినవ్రాతలం

బట్టి వాఁ డాహత్య చేసెనని యు, దాని కంతకుం దిలకుండు ప్రోత్సాహకరుం డగుటయు నీపై నభియోగము మోపఁబడి యున్నది.

తిల—సరే! దీనికింత యేమిటికి? రా నున్నది రాకమానదు.

ఆ. మనుజమాత్రుఁ డెంత ౯ పని చేసి తప్పించు
కొందు నన్నఁ గాని ౯ కుతలమందుఁ
దప్పు దెట్టులేని ౯ తా వచ్చి పడు గీడు
గాని మేలు గాని ౯ కర్మవశత. ౧౨

నామ—అంతకును దైవమే కలదు. మన మేమి చేయఁగలము?

[అంత నిద్దఱు రక్షకభటులు విచ్చుకత్తులతోఁ బ్రవేశించుచున్నారు.]

ర-భ—(తిలకుం దరియవచ్చి పత్రికం జూపి)మహారాజ! మీపై నభియోగము వచ్చినది. మీరు మాతోఁ బొంబాయికి రావలయును.

తిల—సరే! వచ్చెదను. (మిత్రులం జూచి) మీరు ధైర్యమును వీడక పత్రికాకార్యము నిర్విఘ్నముగఁ గొనసాగించుచుండుఁడు. నే నిదె బొంబాయికిం బోయి నాపక్షమున వాదింప దేవారు న్యాయవాదిగ నిలుపుకొనియెద. దైవము మీఁద భారము వైచి పోయివచ్చెద. సెలవీయుఁడు. (రక్షకభటులతో నిష్క్రమించుచున్నాఁడు.)

ఇద్దఱు—(అనుసరించి నడచుచున్నారు)

ఇది ద్వితీయాంకము.

శ్రీరస్తు.

# తిలకమహారాజనాటకము.

## తృతీయాంకము.

స్థలము ఇంగ్లండులో నొకభవనము.

[మేక్సముల్లరు, విలియంహంటరు ప్రవేశించుచున్నారు.]

మేక్స—నాప్రియమైనమిత్రుఁడా ! ఇపుడు హిందూదేశవృత్తాంతము లేమి వినవచ్చుచున్నవి ?

విలి—నీ వెప్పుడు హిందూదేశమునే తలపెట్టుచుందువు. నీకింత ప్రీతికిం గారణ మేమి ?

మేక్స—ఈభూమండలంబునం గలసమస్తఖండములలో భరతఖండముం బోలినఖండము మఱియొక్కఁటియు లేదు. అది స్వర్గమునకన్న మిన్న. అందలిజనులు దయాసత్యశౌచనిరతులు. వారు దేవత లని చెప్పినను జెప్ప వచ్చును.

విలి—ఆదేశమందు దేవతలుకూడఁ బుట్టి రని యే చెప్పుదురు.

మేక్స—దేవతలే కాదు. వారికన్న మిన్న లగువారుం బుట్టిరి. ఇప్పటికి సంఖ్యాతీతమహాపండితు లాదేశభూషణములై విరాజిల్లుచున్నారు. వా రందఱును స్వార్థత్యాగము చేసి దేశాభిమానవిరాజమానులగులోకమాన్యులు. ఆదేశమందుసత్యము, శౌచము, న్యాయము, ధర్మము దానము, మొదలగు నుత్తమగుణంబులు పుట్టె. వేదశాస్త్ర శ్రౌతాది మహావిద్యలకును, రసాయనాది శాస్త్రంబులకును, అణిమాద్యష్టసిద్ధులకు నాదేశంబు నిలయంబు. ఏకఘ్నులు, శతఘ్నులు, మహామహోన్నతజ్యోతులు, ధూమశకటాదులు, విద్యుద్యంత్రములు, లోనగునవి యెల్లఁ దొల్లి హిందుదేశంబునం దైనవియే. సమస్తసస్యములకు నాల

వాల మై సమస్త దేశస్తోత్రపాత్రం బైనది హిందుదేశంబ కావున నాకు దానిపై నంత ప్రీతి.

విలి—హిందూదేశములో నిపుడుసర్వవిషయములందును శిరోమణి యని యెన్నఁ దగినవా రెవ్వరో చెప్పుము.

మేక్స—చెప్పెద వినుము. ఇప్పు డట్టివారిలో బాలగంగాధర తిలకుం డగ్రగణ్యుఁ డని చెప్పక తప్పదు.

విలి—అయ్యో! (తల పంకించి నిట్టూర్పు నిగుడ్చుచున్నాఁడు)

మేక్స—ఏమియిట్లంటివి ?

విలి—బాలగంగాధరతిలకుండు దొరతనమువారిం దూలనాడె నని నేరము మోపఁబడి పదునెనిమిదిమాసములు శిక్షింపఁ బడినాఁడు.

మేక్స—(నివ్వెఱ పడి) నేర మెట్టిది ? యేకోర్టులోఁ దీర్మానింపఁ బడెను ?

విలి—బొంబాయిరాష్ట్రమున మహామారిబాధానివారణార్థము దొరతనమువారు కొన్ని యేర్పాటులం జేసియున్నారు. కాని తదీయులు కొన్నియన్యాయకార్యములుచేసి రోగులను వారిసంబంధులను హింసించుటకు మొదలుపెట్టినారు. అదిన్యాయము కాదనితిలకు తనపత్రికలోఁ దీవ్రముగా వ్రాసి యున్నాఁడు. అవల నెవ్వఁడో ఘాతుకుఁడొకఁ డేమి కారణముననో గాని ర్యాండై రెస్టులను జంపినాఁడు. తిలకునివ్రాఁతయట్టి యీహత్య కావింపఁబడె ననియు దీనికంతకుఁ దిలకుండే కారణంబనియు శంకించి వానిపై నభియోగముం దెచ్చి బొంబాయిహైకోర్టులో విచారించి శిక్షించినారు. ఇదిగో చూడుము. (అని పత్రిక నిచ్చును.)

మేక్స—(పుచ్చుకొని చదివి విచార మభినయించి) నేను దిలకునిఁ జూడకున్నను వానిపాండిత్యమును, వానిధైర్యస్థైర్యసాహసాదిగుణంబులును వానివిశాలహృదయంబును, వానిదేశభక్తియు వానిస్వార్థ

త్యాగంబును, వానిసత్యసంధతయు, వానియద్వైతతత్త్వంబును, విను కలింజేసి మెఱుంగుదును గావున నవి నన్నుఁ బ్రేరేచుచున్నవి. ఇందు మనశక్తివంచన మించుకయు లేకుండఁ బాటుపడి విక్టోరియామహారాజ్ఞికడ విన్నవించి వానివిముక్తికై ప్రయత్నింతము. రమ్మిపుడు మహారాజ్ఞియుం గొలువుదీరువేళ యయిన దని తెలియుచున్నది.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

---

—* స్థలము—కొలువుకూటము. *—

[విక్టోరియామహారాజ్ఞియు, మహామంత్రియు, కార్యదర్శియు, ఇద్దఱు పార్లమెంటుసభ్యులును, గొలువు దీరియుండ, మేక్సముల్లరును, విలియంహంటరును ప్రవేశము.]

ఇద్దఱు—జయము మహారాజ్ఞీ! (వంగినమస్కరించుచున్నారు)

మంత్రి—(కూరుచుండనియోగించి)మీయాగమనకారణం బేమి?

మేక్స—మహారాజ్ఞియు మహామంత్రులయు నాజ్ఞయయినచో నొక్కవిషయము విన్నవింప వచ్చినారము.

విక్టో—విన్నవింప వచ్చును.

మంత్రి—చక్రవర్తినిసెలవైనది కావున విన్నవింప వచ్చును.

మేక్స—భారతవర్షభూషణుండును లోకమాన్యుండు నైనబాలగంగాధరతిలకున కిపుడు శిక్ష విధించిరఁట! అది యన్యాయ మనియు వాని విముక్తునిఁ జేయింప వలయు ననియు విన్నవింప వచ్చితిమి.

విలి—హిందూదేశమందు కాదే దేశమందును వానిఁ బోలినమేధాశాలి లేడనియు వానిప్రవర్తనము కీర్తనీయం బనియు వానిం బందె నుంచుట బ్రిటిషుప్రభుత్వమునకుఁ గీర్తిదాయకంబు గా దనియు, విన్నవించు చున్నవాఁడ.

కార్య—ఆతని కాహిందుదేశమందు మిక్కిలిపలుకుబడియున్నది. ప్రజలెల్ల వానిమాటకు నడతురు విశేషించి బొంబాయిరాష్ట్రమందెవ్వరును వానిమాట లేక యేయింతపనియయినం జేయ సాహసింపరు. ర్యాండైరస్టురలు జంపిన కేసులో నతనిప్రోత్సాహ మున్న దని తీర్మానించియే శిక్ష విధించినారు.

1 పార్లమెంటుసభ్యుఁడు—పలుకుబడి కలవాఁ డెట్లు చేయించుట కైన సమర్థుఁడు. అతఁడు వాక్కులతోఁ బ్రోత్సహింపకున్న వ్రాఁతలలోఁ బ్రోత్సహించుటం జేసియే హంతకుఁ డాహత్య చేసినాఁడు. లేకున్నఁ జేయఁ జాలఁడు. బొంబాయిహైకోర్టువా రధికదోషియయిన దానింగగుణించి కొంచెముశిక్షతోఁ బోనిచ్చిరని విచారించుచున్నాను.

2 పార్లమెంటుసభ్యుఁడు—పత్రికలలో దొరతనమువారియుద్యోగస్థులు మహామారిలో నక్రమము చేయుచున్నారని వ్రాసినంతమాత్ర నేయింతనిదర్శనము సాక్ష్యము లేక దేశమునఁ బలుకుబడి కలవాఁ డను కారణంబున నిర్దోషి యగుతిలకుని దోషి యని నిర్ణయించి శిక్షించుట న్యాయంబు కాదు.

మంత్రి—అంత విద్వాంసుఁ డైనమహాపురుషుఁడు లోకజ్ఞుఁడు గాని సామాన్యుఁడై యుండఁడు. అట్టిలోకమాన్యుఁ డట్లు నిష్కారణముగా నరహత్య చేయం బ్రోత్సహించి యుండఁ డని యూహింపవచ్చును. కాని సంగతిసందర్భములు వినకుండ నిశ్చయించుటకు వీలు కాదు.

మేక్స—మహామంత్రిశేఖరా! అదియంతయు సాంతముగా నీసభలో విన్నవింప నున్న వాఁడ.

మంత్రి—సమయం బిచ్చితిమి.

మేక్స—ఆయభియోగమునకు మున్న తిలకునిపవిత్రచరిత్రము కొంచెము చెప్పుట కనుజ్ఞ వేఁడుచున్నాను.

మంత్రి—సరే! చెప్ప వచ్చును.

మేక్స—శ్రీబాలగంగాధరతిలకు 1856 వ సంవత్సరమున రత్నగిరియందు జన్మించి 1876 వ సంవత్సరమునఁ బట్టపరీక్షం గృతార్థుండై

1879 వ సంవత్సరమున యల్. యల్. బి. పరీక్షలో నుత్తీర్ణుండై పర తంత్రజీవనం బొల్లక స్వతంత్రజీవనంబు సేయుచు దేశసేవ( జేయం దలంచి కొందఱు మిత్రులం గూడి పాఠశాలల( బెట్టి పత్రికలు నెల కొల్పి సర్వకళాశాల స్థాపించి ప్రఖ్యాతిం గాంచె. అతఁడు మేధావం తుఁడు, గుణవంతుఁడు, శాంతుఁడు, దాంతుఁడు బాల్యంబున వేదశా స్త్రంబు లభ్యసించె. రసవాదశాస్త్రంబును, గణితశాస్త్రంబును, వాని కభిమానశాస్త్రంబులు. గీతాశాస్త్రం బతనిజిహ్వాగ్రరంగంబున నాట్య మాడుచుండు. ప్రకృతిశాస్త్రంబెల్ల నాతండు పరిశోధించి చరితార్థుం డయ్యె. వానివ్రాఁతలమూలమున హిందువుల కనేకనవీనోద్యమము లేర్పడి యనేకనవీనాచారములు వాడుకలోనికి వచ్చినవి. అతండు బొం బాయిశాసననిర్మాణసభయందును, విశ్వవిద్యాలయమందునుసభ్యుఁడై కొంతకాల ముండి పనిచేసియున్నవాఁడు. బొంబాయిలో మహామారి మము వచ్చినప్పుడు దొరతనమువారితోఁ జెప్పియుఁ దాను స్వయ ముగాఁ జేసియుఁ బ్రజలఁ బోషించె. మహామారి ప్రబలమై ప్రజల నెల్లం దనవాతఁ బెట్టుకొనుచుండఁ దనప్రాణంబుల గాశింపక స్వదేశౌ షధశాలలఁ స్థాపించి రోగుల నటకుం గొనిపోయి మందులిచ్చి పథ్య పానము లిచ్చి పాటుపడుచు దొరతనమువారికిం గూడఁ దోడుపడి యున్నవాఁడు. అతం డక్రమకార్యంబులం దెప్పటికిని బ్రవర్తింపఁడు. పరులు తన్నుఁ దూరినను బెడచెవిం బెట్టి తనధర్మ మెద్దియో దాని నాచరింపక మానఁడు. ప్రపంచసుఖం బెల్ల మిథ్యయని తలంచినయో గిపుంగవుఁడును వాని కింత వెనుఁబడి యుండును. ఆతండు వేదకాల మునుగూర్చి యొకమహాగ్రంథము రచించె నది సర్వజనసంస్తవనీయం బై విరాజిల్లుచున్నది. ఆతనికి జాతీయవిద్యావాదము జీవనము. స్వరా జ్యము స్వారాజ్యము. ఆలోకమాన్యుఁ డీనడుమ దొరతనమువారిని దూషించె నని యొకనేరము మోపఁబడి బొంబాయిహైకోర్టులో విచారింపఁబడినది. అం దార్వురు తెల్లదొరలు ముగ్గురు హైందవు

లును బాచాయితీదార్లుగా నుండిరి. వారిలో నాంగ్లేయు లాయ్వరును ద్వేషభావంబునఁ దిలకు దోషి యనిరి. న్యాయాధికారి వెనుక ముందు తెలియంగ నేరక వానికిఁ బదునెనిమిదిమాసంబులు కఠినశిక్ష విధించె నతండు తనతీర్పులో "తిలకు దొరతనమువారి కనేకపర్యాయములు మహామారీవ్యాధినివారణము చేయుకార్యములకుఁ దోడుపడియున్నాఁడు." అని వ్రాసెను. ఇట్లు తమకార్యములకుఁ దోడుపడువాఁ డెట్లు ద్రోహియగునో తెలిసికొనం జాలక ధర్మసూక్ష్మ మెఱుంగనిన్యాయాధికారి యన్యాయాధికారియయి శిక్షించె. ఈశిక్ష శాస్త్రీయ మయినది కాదనియుఁ బండితోత్తముఁ డగుతిలకు నిర్దోషి యనియు దండనార్హుఁడు గాఁడనియు వానిచెఱ విడిపింపుఁడనియు బోధించుచున్నారను. ఇదె మనదేశమునం గలపండితు లెల్లరును తిలకు నిర్దోషి యతనికి విడుగడం గలిగింపుఁడని విన్నవించుచున్నారు. (అనిపత్రికనిచ్చును.)

విక్టో—(దాని జదువుకొని మంత్రి కిచ్చుచున్నది.)

మంత్రి—(సెక్రెటరీయొద్దనుండి రికార్డునుం దెప్పించిచూచి) ఈనేరము నమ్మనర్హమైనది కాదనియుఁ దిలకు నిర్దోషియని యునభిప్రాయము.

విక్టో—ఆహా! యిట్టియుత్తమగుణసంపన్నుండు నాపరిపాలితదేశంబున నుండెనని చెప్పుకొనుటకు నేనుమిక్కిలిసంతసించుచున్నాను. తత్క్షణమ వాని విముక్తునిగఁ జేయుఁడని శాసించుచున్నాను.

మంత్రి—చిత్తము. మహారాజ్ఞియాజ్ఞ (సెక్రటరీదిక్కుచూచును)

సెక్ర—దేవరయాజ్ఞానుసారము రాజప్రతినిధికి తంతినిచ్చెదను.

ఇద్దఱు—బ్రిటిషుసామ్రాజ్యము దింతయైనను న్యాయ మున్నదని తెలియ వచ్చినందులకు మిక్కిలి సంతసించుచున్నారము. ఆజ్ఞయైనంగుఁడు పోయివచ్చెదము. (నమస్కరించి నిష్క్రమించుచున్నారు.)

విక్టో—మోక్షమూలరబిరుదాంకితునిమహోపన్యాసమునఁగాలాక్రతిమణ మైనది. నేఁటి కీకొలువు చాలింతము (అని లేచును)

అందఱు—(లేచి నిష్క్రమించుచున్నారు. ఇదితృతీయాంకము

శ్రీరస్తు.

# తిలకమహారాజనాటకము.

## చతుర్థాంకము.

స్థలము పూనాలో రాజవీధి.

[రామావధాని, వేంకటశాస్త్రి, యను బ్రాహ్మణులు
ప్రవేశించుచున్నారు.]

రామా—మీరీనడుమ కనుపించుటలేదు. ఎక్కడకు వెళ్లినారు?

వేంక—సతారాకు వెళ్లివచ్చినాను. మీరిక్కడనేయున్నారా? విశేషము లేమి?

రామా—ఇక్కడనే యున్నాను. ఇట గణపతినవరాత్రములు మహోన్నతవైభవముతో జరిగినవి. అదియే విశేషము.

వేంక—ఆవైభవ మెట్లు జరిగినది?

రామా—ఇట్లని చెప్ప శక్యముకాదు. ఆనవరాత్రములలో

ఉ. ఓదనపర్వతాంతరసముద్భవమై ప్రవహించునాజ్య మ
 మేదురవాహినీనరమహేయరసాయనభక్ష్యభోజ్యసం
 పాదకదారుసంచయసమాచితమై చని బాడబాస్యము
 మోదముతోడఁ జేరుకొనెఁ గి బూటకుఁ బూటకు మేటియై యటన్.

వేంక—ఇట్టిమహోత్సవముఁ జేయించినవా రెవరు?

రామా—పుణ్యపురీవాసు లందఱును. అందు బాలగంగాధర తిలకుండు ముఖ్యుండు. అతండు తనదేశంబునం గల ప్రముఖుల రావించి యట్టిమహోత్సవము గావించె. ఇట్లు ప్రతివత్సరమును జరుగు నఁట!

వేంక—ఏమి ప్రయోజనము నుద్దేశించియో?

రామా—“ఆదౌ పూజ్యో గణాధిపః” అని చెప్పుటం జేసి

ఆ. చదువునపుడు పెండ్లిసేయుసలుపునప్డు ప్రయాణ
మమరినపుడు యుద్ధమయినయపుడు
మఱియుఁ గలుగుపనులు నలుపునప్పుడు గణ
పతినిఁ గొలువ విఘ్నతతులడంగు. 2

వేంక—సరే! మఱి యెట్టియుత్సవము జరిగినది?

రామా—లోకైకసుందరం బైనగణపతిమందిరంబు గల్పించి తత్సన్నిధానంబున దూర్వత్రికం బెసంగ సమారాధనంబు చేయుటయ కాక నానావిధోపన్యాసములును బ్రతిదినంబును జేయుచుందురు. అదియే పరమోత్సవము.

వేంక—నా కాయుత్సవము చూచుభాగ్యము లేకపోయినది!

రామా—ఇపుడు మఱియొకయుత్సవము జరుగును. దానిం జూచి యానందింపరాదా?

వేంక—అది యేమియుత్సవము?

రామా—శ్రీశివాజీమహారాజజన్మదినోత్సవము.

వేంక—అది యెట్లు జరుగును?

రామా—చెప్పఁ జాలను గాని పుణ్యపురం బంతయు నెంతో వింతగ నలంకరింపఁ బడియె. మహాసనంబు లఖిలసంభారసంభరితంబులుగా నిలుపంబడియె. ఉత్సవదర్శనార్థ మెల్లకడలం గలవారి కాహ్వాన పత్రికలు పంపఁబడియె. మహం బెంత మోదావహం బగునో చూడవలయు? (తెరలోఁ గలకలము. ఆకర్ణించి) అదిగో శివాజీమహోత్సవమిటనే వచ్చుచున్నది. మనముకూడ నటఁ బోయి చూతము రమ్ము.

ఇద్దఱు—(నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

(అంత నొక విమానంబుమీఁద శివాజీవిగ్రహమును బెట్టి మోయుచుఁ గొందఱును, వారికిఁ బూర్వాపరభాగంబుల మృదంగాదికలకలధ్వనులును, సంగీతసాహిత్యాదినినాదంబులును, జయజయశబ్దంబులును, భోరుకలుగ నానాదేశాగతప్రజలుం బ్రవేశించిన వెనుక విమానమొక్కచో నిలుపఁబడుచున్నది. అంతలోఁ దిలకుండును, కపర్దియు, కేల్కారును, నామజోషియును, కరంధికరుప్రభృతులును బ్రవేశించుచున్నారు.)

తిల—దేశీయసోదరులారా! నేఁడు గదా సుదినము. ఈశివాజీ జన్మదినము రామకృష్ణాదులజన్మదినము వంటిదై మన కానంద మాపాదింపఁ గలదు సుఁడీ!

కపర్ది—రామకృష్ణాదులజన్మదినములనుస్మరించుచు వారినారాధించుట వారు జేసిన చేతలవలన లోకమునకుఁ గలిగిన మే లెఱింగి మన ముగూడ నట్టి స్వార్థత్యాగము చేసి దేశసేవాపరులమైయుండుట కేకదా!

నామ—దాని కేమిసందేహము! రామకృష్ణాదులు లోకమున కెట్టియుపకారము గావించినవారో మనశివాజీమహారాజు నంతయుపకారము గావించినవాఁడే.

మత్త. దుష్టసంఘముఁ బాఱఁ దోలెను దూరదూరము వోవఁగా
శిష్టరక్షణ మాచరించెను జేరఁ బాఱఁగఁ గూరుముల్
కష్టకార్యము లంతరింపఁగ గట్టికట్టడిఁ జేసి లో
కేష్టవృత్తి మెలంగె రాజగు నీశివాజి మహాత్ముఁడై. 3

అట్టివానిజన్మదినోత్సవము చేసి కృతకృత్యుల మగుభాగ్యమీబాలగంగాధరతిలకునివలనఁ గదా మనకుఁ గలుగ నయ్యెను.

కరం—తే. తెగువ జాతీయవాదియై దేశమునకు
మేలు చేకురఁ జేయుచు మిసిమిఁ గాంచి
బాలగంగాధరుఁడు మనపాలఁ గలిగి
యిట్టిపరమోత్సవముఁ జేయ నెంచె నహహా.! ౪

కేల్కా—ఔ నిది పరమోత్సవమే. మన కాశివాజీ రామకృష్ణాదులవలెఁ బరమోపకారముం జేసినపరమపురుషుండు. వానిచరిత్రము పరమపవిత్రమైనది.

తిల—జనసామాన్యమున కిపు డాతనిచరిత్ర గొంటింగించుట కొంచె మావశ్యకమే సుఁడీ!

కరం—దేశసోదరులారా! శివాజీమహారాజు మొదటఁ జిన్న జాగీరుదారుఁడై యుండి క్రమముగాఁ దనబుద్ధిబలముచేతను, బాహుబలముచేతను, మహారాష్ట్రరాజ్యమునకు రాజై డిల్లిచక్రవర్తి యగు నౌరంగజేబునంతటివాని ముప్పతిప్పలు పెట్టినవాఁడు. అతండు మన దేశమును దుర్భరదాస్యమునుండి విముక్తి నొందింప సంకల్పించినదేశభక్తుఁడు. మతాభిమానము గలవాఁడై తనజీవితమును మతానుగుణముగా మార్చి స్వార్థపరత్వము విడిచి కృతకృత్యుఁడైనవాఁడు. పవిత్రవర్తనంబును, దేవబ్రాహ్మణభక్తియుఁ,బరోపకారపరాయణత్వంబును, గలవాఁ డగుటంజేసి శివాజీ యెట్టిసంకటసమయములం దైనను జలింపనిచిత్తము కలవాఁడై తనపూనినదానిని విడువక సిద్ధసంకల్పుఁడై యుండువాఁడు. అతనిగుణంబు లాతని నీశ్వరావతార మనునట్లు చేసి జనసామాన్యముం దనవంకకుఁ ద్రిప్పుకొనం జాలినట్టి వయ్యె. మనశివాజీమహారాజు రామదాసగురుపాదంబు పట్టి మంత్రోపదేశంబు నొందె. ఆమంత్రప్రభావముచేతను, భవానీభక్తిచేతను, తల్లి యగుజిజాబాయిబోధనముచేతను, సహజసాహసధైర్యస్థైర్యాదిగుణగణంబులచేతను, ఘనకార్యంబు లెల్ల సాధించినవాఁ డయ్యె; తా నెపు డేమిపనిమీఁదఁ బోవుచున్నను దల్లికి మ్రొక్కి రామదాసగురునిం దలంచుకొని పోవు నదియే వానికార్యసిద్ధికి హేతుభూతం బగుచుండె. శివాజీ పూనినపని మొదటఁ బ్రజలచేఁ బ్రారంభింపఁబడి వెనుక నాయకులచే నామోదింపఁబడి జయ

ప్రదం బగుచుండె. మంత్రులలో నగ్రగణ్యుఁ డగుమోరోపంతుపింగళే యనుబ్రాహ్మణుఁడు సైన్యములనెల్ల నడిపించి నానావిధయుద్ధములు చేయుచుండి శివాజీకి నెల్లవిధములం బెట్టనికోటయయి యుండి నూతనోద్యమమునకు బల మొసంగి హిందూరాజ్యపునర్నిర్మాణమునకుఁ దోడుపడియె. రాష్ట్రాధిపతి యయినశివాజీ తన కుపదేశగురుం డైన రామదాసస్వామి కొకసమయంబునఁ దనరాజ్య మంతయు దానంబు చేసియు వానియాజ్ఞానుసారము దానిని వెండియుం గొనిజాతీయపద్ధతు లభివృద్ధిం జేయుచు లోకప్రస్తుతుండయ్యె.

చ. అలరి తురీయవంశమున నందు శివాజిమహాప్రభుం డొగిన్
గులగురుపాదభక్తి తన కుం బలమై తగ రాజ్య మేలె మున్
దెలియఁ దురీయవంశమునఁ దేజి మెలంగెదునన్నలార ! మీ
రలచుచు విప్రవైరమున కందకుఁడీ శుభ మందఁ గోరినన్. ౫

కేల్కార్ — ఆతనియుద్ధంబులును బ్రశంసనీయములే.

కపర్ది — మిత్రులార ! కరంధికర్మహాశయునియుపన్యాసంబునం చేసి శివాజీమహారాజు జెట్టివాఁడో తెలియ వచ్చినది కదా ! ఆతఁడు తనకుఁ బదునెన్మిది యేండ్లయీను వచ్చువఱకు విద్యాభ్యాసాదికార్యంబులఁ గాలంబు గడిపి 1646 వ సంవత్సరమున మునుమున్న తోరణదుర్గమాక్రమించుకొని రాయఘడికోటన్ బలపఱచి యది తననివాసముగాఁ జేసికొని యది మొదలుకొని యాఱుసంవత్సరములవఱకుఁ బూనాకుఁ జుట్టుప్రక్కల నున్నకొండకోటలలోని ఖిలేదార్లను వశపఱిచుకొని తనజాగీరులోనికోటలు చక్కఁజేసికొని తనచుట్టు నైకమత్యము లేక చెదరి యున్న మహారాష్ట్రనాయకుల రక్తపాతము లేనివిధంబునఁ దనలోఁ గలుపుకొని పిదపఁ దనతండ్రిం బట్టిన బిజాపురపుసుల్తానుతోఁ బోరు పెట్టుకొనియె. ఆపోరు తీఱువఱకుఁ బదిసంవత్సరములు పట్టినది. తుదకుఁ దొంటికంటె నధిక దేశమునందుఁ దనయధికారము సాగునట్లు

నిబంధనలు చేసికొని ప్రబలుఁ డయ్యె. తరువాత మొగలాయీప్రభుత్వముతోఁ బోరి విజయముఁ గాంచె. కాలాంతరంబునఁ గర్ణాటద్రవిడదేశంబులును జయించి విఖ్యాతిం గాంచె. మఱియు నెంతేని నావికాసైన్యముం గూర్చి కొంకణములోని సముద్రపురేవు లన్నియు స్వాధీనము చేసికొనియె. అప్పుడు పురందరు మొదలుకొని కళ్యాణదుర్గము వఱకును సహ్యాద్రిపాదువున నుండుదుర్గములును, చాకాను మొదలు కొని నిరావతినదివఱకుం గలమహాదేశమును సంపాదించి శివాజీ పరిపాలించె. అతఁడు తనరాష్ట్రమును బదునాలుగుభాగములుగ విభాగించి వానికి సుబా లని పేరు పెట్టి ప్రవర్తింపఁ జేసె. మొత్త మాపీరాగ్రేసరునిస్వాధీనమందు 780 దుర్గంబు లుండె. అమాత్యులును, సేనానాయకులును, సైనికులును నతనియం దెప్పుడును నత్యంతభక్తివిశ్వాసములు గలిగి యుండువారు. శివాజీ విశేషవిద్యావంతుఁడును, విశేషధనవంతుఁడును గాకపోయినను స్వార్థపరాయణుండు కాఁడు గావున, స్వశక్తిం జేసి కృషి చేసి చక్రవర్తు లంతటివారి నోడించి యసహాయశూరుఁడై యొకమహారాష్ట్రమును స్థాపించి పాలించుచు మహారాష్ట్రపట్టముఁ గట్టుకొని దేశసేవాపరుండై పరులచే సైతము కొనియాడంబడి శాశ్వతకీర్తిఁ బడయం గలిగె.

నామ——మనశివాజీకిఁ బదియేండ్లప్రాయము వచ్చినప్పుడు వానితండ్రి శహాజీ కొడుకుం బిలిచి "తండ్రీ ! నీవు నాతో నవాబుదర్బారునకు వచ్చి నే నడచుకొనునట్లు నడచుకొన నేర్చికొనుము" అనియె. అప్పుడు శివాజీ——

ఉ. గోవులఁ జీల్చి కోవెలలఁ గూల్చెడు కూరిరులకొల్వులోనికిం
బోవఁ దలంప నెప్పుడును బోయినవారికిఁ జేతు లెత్తి నే
నేవిధ మైనమ్రొక్కులును నేవముగాఁ బచరింపఁ జేసి త
త్సేవ యొనర్ప నాతనువు చెన్నరి పోయినఁ గాని సద్గురూ. ఉ

క. బానిసవృత్తిం జేయఁగ
మానసమున నేఁ దలంప మనుగడ దిరమే
నే నేఁడఁ బొట్టకూటికి
మానవపశువులను గొల్చు మది యేడ నయో. ౭

అని చెప్పి తండ్రికిం బ్రత్యాఖ్యానము చేసె నఁట! వింటిరా మనము నిపు డాశివాజీచరిత్రమున నట్టిసద్గుణంబులలవరించుకొనవలయుంజుఁడీ.

కేల్కార్.—ఆ. భరతమాత యిట్టివరసుతులం గన్న
తల్లి గానఁ దనకుఁ జెల్లమి యగు
నదను వచ్చినపుడు నట్టిట్టు పడక తాఁ
గాచి యుండె మంచికాలమునకు. ౮

నామ.—లోకమాన్యుఁ డీసందర్భమునఁ గొంత లోకతంత్రం బుపన్యసింప నెల్లవారుం బ్రార్థించుచున్నవారు.

తిల.—(లేచి చేతులు జోడించుకొని)

ఉ. శ్రీమహనీయమూర్తి యయి చెన్నలరారి ధరాతలంబునన్
నేమముతోడ శత్రుల నణిం బరిమార్చి స్వదేశబంధువై
ప్రేమకు నాలవాలమయి పేర్మి నెసంగినవీరుఁ డాశివా
జీమహితాత్మ నాత్మనముఁ జేరి మెలంగుత మెల్లకాలమున్.

దేశీయసోదరులారా! మన మీశివాజీమహారాజజయంత్యుత్సవము కొన్ని సంవత్సరములనుండి చేయుచుంటిమి గాని, ప్రభుత్వమువా రిందు మనయభిప్రాయ మిట్టిదని తెలియఁ జాల కున్నారు. ఇపు డీసభలోఁ గొందఱు గూఢచారులు మనచెయ్వు లారయ వచ్చి యున్నారు. వీరి కీఁ గా రెండులక్షలరూప్యములు మనప్రభుత్వమువారు వెచ్చపెట్టుచున్నారు. అవి శిల్పాదివిద్యలు నేర్పుటకు వెచ్చించిన నెంతయో మే లగును గదా! దొరతనమువారికిఁ బ్రజలయం దిట్టిసందేహ మేల కలుగవలెను? నెమ్మనమ్మున నమ్మినదానిని జెప్పునప్పుడు భయ మేమి

టికి ? ఏహిందువుఁడును దనమనోభిప్రాయమును వెల్లడించుటకు వెనుదీయఁడు. మనముప్రభుత్వమువారితోఁ గలహించుట కీశివాజీజన్మదినోత్సవము చేయుట లేదు. దొరతనమువారిట్టియుత్సవములఁదప్పుగా గ్రహించుట వెఱ్ఱితనము. హిందువులలోఁ జదువుకొన్నవారు శత్రువులని మోర్లేగా రనేకవారములు చెప్పియున్నారు. అ క్లేల చెప్పియున్నారో యెల్లవారికిం దెలిసినవిషయమే. అది యట్లుండుఁ గాక. ఇప్పుడు చేయుచున్నయుత్సవసందర్భమున జనులకు మన మెట్టిజ్ఞానము బోధింపవలయును ? శివాజీమహాజ్ఞాని. అతఁడు తనజ్ఞాన మెట్లు కాలమునకుఁ దగిన ట్లుపయోగించుకొనియెనో మనము నట్టిజ్ఞానము సంపాదించుకొని జనులకు బోధింప వలయును. ఇట్టిమహోత్సవములు లోకులకు ధైర్యస్థైర్యములం గలిగించి లో నున్నభయాదులం బోఁగొట్టినవీనోత్సాహబీజమును హృదయక్షేత్రమున నాటఁగలవు. మనము న్యాయమార్గప్రకారము నడచుచున్నారము. మనది యక్రమ మని సర్కారువారు తలంచుట విచిత్రము గదా ! చదువున్న మనవాండ్రు తా మెక్కువస్థితికి రావలయునని కోరనచ్చును. ఆకోరుటదోషము లోని దెంతమాత్రమును గాదు. మనదేశములో నున్నగర్భదరిద్రులును దక్కువజాతివారును, చదువు రానిరైతులు మొదలగువారును ప్రభుత్వమువారివా రఁట ! ఈభావమును లోగన్ వెల్లడించియున్నాఁడు. చదువురానివా రెట్లున్నను జదువు వచ్చినవారు లోగన్ వార్తల నాక్షేపింపక మాన రని నాయభిప్రాయము. ఎల్లవారికిఁ జదువు వచ్చినయెడల నాంగ్లేయోద్యోగులజిత్తులు తేటతెల్లం బగు ననియే. చదువుకొన్నవారికి జ్ఞానము, ధైర్యము నుండును గావునఁ వారు జదువు రానివారినిఁ బురికొల్పి న్యాయ మగుతమహక్కుల నిమ్మని దొరతనమువారిని గోరుట విరుద్ధముగాదు. హిందూదేశప్రభుత్వకార్యదర్శి చదువు

కొన్న హిందూదేశస్థులను విద్వేషులు గ భావించుచున్నాఁడు. అది యుక్తము కాదు. స్వదేశీయులు తమవిజ్ఞానబలంబున సర్వసంపదలుం బొందఁ గలరు. కాసునకు గతి లేనివాఁ డయినను దొల్లి యెన్నో మహాకార్యములు చేయఁ గలిగినట్లు చరిత్రలు చెప్పుచున్నవి. మన దేశములోఁ జాణక్యునికన్న గర్భదరిద్రుఁడు లేడు గదా! అతఁడు తన్నవమానించిన నందవంశజుల నెల్ల నిర్మూలింపఁ జాలి యుండ లేదా? మానభంగమున కెవ్వఁ డోర్వఁ గలఁడు? ఎవరెట్లసూయఁ జూపినను మనవారు నారిజిత్తులలోఁ జిక్కుకొనక తమపట్టినపట్టును విడువకముందు నడతురేని హిందూదేశము తనతోడి దేశములవలెఁ దానునుం బోడిమి గాంచఁ గల దని నానమ్మకము. విక్టోర్యామహారాజ్ఞిగారిచే నొసంగఁ బడినవాగ్దానము దానపత్ర మని డామే లనునాతఁడు వ్యాఖ్యానము చేసియున్నాఁడు. ఆవ్యాఖ్యానము కువ్యాఖ్యానము గాని సువ్యాఖ్యానము కాదు. రాజ్ఞివచనము రాజనీతి ననుసరించినదే కాని మఱియొకటి కాదు. కొందఱు మూఢులు రాజు దేవాంశసంభవుఁడు గాన వాని యధికారమునకు లోఁబడినజనులు తమహక్కులను బొందుటకైనను రాజు నధిక్షేపింపఁ గూడ దని చెప్పుదురు. శాసనమందుండుసూత్రములకు వ్యాఖ్యానముచేయుట తప్పుకాదు. రాజుమాత్రమే దేవాంశసంభవుఁడు తక్కినవారు కా రని తలంపరాదు. వేదాంతశాస్త్రప్రకారము ప్రతిజనునిలోని యాత్మయుఁ బరబ్రహ్మములోనిభాగమే రాజు జనులకు సౌఖ్యము గలుగునట్లు పాలించుట తనకు విధియై యున్నది. రాజుతప్పు చేసినప్పుడు వాని నాక్షేపింపరా దని మనువు చెప్పియుండ లేదు. రాజు తా నిట్లు చేయుదు నని ప్రజలతోఁ జెప్పకున్నను ఋషిపర్యు లిట్లు చేయ వలయునని మార్గము సూచించి విధించినారు. సర్వసంగపరిత్యాగు లగుమహర్షులు మనకుఁ జట్టములను బుట్టించినారు. వారి కెక్కువతక్కువలు లేవు, అందఱును వారికి సమానులే. తన

ధర్మమును నెరవేర్పని రాజున కేమిసంభవించునో మనకందఱకును దెలియును. రాజే దేవత యన వచ్చునుగాని వానికిని బ్రజకును గలహము పుట్టినపుడు వేఱొక దేవత పుట్టక మానదు. అతఁడు రాజుకన్న బలవంతుఁ డగును. శ్రీరాముఁడును బరశురాముఁడును భగవదంశసంభూతులే. కారణాంతరమునఁ బరశురాముని తేజ మొకప్పుడు శ్రీరాముని లోఁ బ్రవేశించెను. ప్రవేశింపఁగానే పరశురాముఁడు మనవలె సామాన్యమనుష్యుఁ డయ్యెను. ప్రజలు కూ్రరుఁ డగు రాజునకు లోఁబడి యుండ వలయు నని యెందును జెప్పఁబడియుండ లేదు. దేవాంశసంభూతుఁ డగు రాజు న్యాయమును విడిచి యన్యాయప్రవర్తకుఁ డయ్యెనేని వానియందలి దేవాంశ మప్పుడే విడిచిపోవును. అపు డతనిస్థానమున నింకొక దేవత వచ్చును. శివాజీమహారాజునకు వేదాంతము చక్కఁగాఁ దెలియును. దానియుపయోగము నతఁ డెఱింగినదియే. ఇప్పుడు నేను జెప్పెడుచోప్పునఁ జేసినయెడలఁ గొంత బాధపడవలసి వచ్చును. కాని "కష్టేఫలీ" యని మీ రెఱుంగనిది కాదు. మనము కోరినదాని వలన రాజ్యమందు మార్పు గలుగును. ఈమార్పు రక్తపాతము గాకుండఁ నుండవలెను. స్వలాభపరిత్యాగ మామార్పునకుఁ బ్రథమ సోపానము. మార్పుఁ గోరనివారు స్వార్థపరాయణులు. కోరినవారికిఁ గారాగారము. మీకోరికలు మీరు పొందుట కనేకసాధనము లున్నవి. ఆసాధనములు మీ రుపయోగించితిరేని నెత్తుటిబొట్టు క్రిందఁబడనక్కఱలేదు. మీరు న్యాయమార్గ మతిక్రమింపక పాలకులతోఁ బోరాడి మీకోరికలం బొందుఁడు. మీసాయము లేక దొరతనమువారిపనులు సాగవని యెఱుంగుఁడు. మీరే వారిపనులకుఁ దోడుపడుచున్నవారు. మీ కెన్నియిక్కట్టులు వచ్చినను మీరు వారికిఁ దోడుపడ మని నిర్ణయించుకొనుఁడు. అప్పుడు సర్వమును సాధ్యమగునని మీరు తలంపుఁడు. మీరు మీదేశమునకై పాటుపడుఁడు. మీగౌరవమును మీరు కాపాడుకొనుఁడు

మీరెల్ల బానిసవృత్తిలోనివా రని మి మ్మైరోపాఖండవాసులు చూచు నవ్వుచున్నారు. దీనివలన మీ రెంతతక్కువస్థితిలో నున్నారో తెలిసి కొన రాదా ? ఈచెప్పుటవలన మీరు న్యాయవిధుల నతిక్రమింప వలె నని తలంపకుఁడు. అతిక్రమించిన దేవునియాగ్రహమునకుఁ బాత్రు లగుదురుసుఁడీ. మనహక్కులను మనకీయఁగూడ దనువారుగూడ దేవుని యాగ్రహమునకుఁ బాత్రు లగుదురు. రాజభక్తి గలవాఁ రెవ్వరో లేని వా రెవ్వరో తెలిసికొనుటకు దొరతనమువా రసమర్థులై యున్నారు. సత్యవాది రాజద్రోహియనియు డంబములు వల్కువాఁడు రాజభక్తుఁ డనియు వారు తలంచుచున్నారు. మీరు రాజద్రోహు లని యెంచి మిమ్ము దండించినను మాహక్కులను మా కీం డని యడుగుట మాన వలదు. మాది మాకిం డని యడుగుటలో రాజద్రోహము లేదు. మీ హక్కులను మీరుపొందుకాలము సమీపించి వచ్చినది. మా కిది కావ లయు నని నిరూపించి మీ రడుగ వచ్చును. మన కనేకులు చేరియున్న దొరతనము కావలయును. అం దనేకజాతులు చేరియుండ వలయును.

ఉ. సేమము గానిశాత్రవులకెచెల్మినిఁ గోరనియట్టిదై ప్రజా
స్వామిక మైనరాజ్య మది సర్వసుఖంబుల కాలవాలమై
మామక మైనదేశమున మండనమై పొలుపొందుచుండున
ట్లామహనీయమూర్తి పరమాత్ముఁడు మాకు ననుగ్రహించుతన్.

అందఱు—(కరతాళధ్వనులు చేయుచు) (తిలకమహారాజ్ కీ జయ్) అని కోలాహలము చేయుచున్నారు.

కపర్ది—ఈమీగంభీరోపన్యాసమున నీసభాస్తారులమదు లెల్లఁ బల్లవించినవి సుఁడీ !

కేల్కార్—మీరు మాకుగురువులు మీయుపన్యాసము కొన సూచించిన సాహాయ్యనిరాకరణ మెన్నియోనాళ్లనుండి నాయుల్లంబునఁ బల వించుచున్నదియే.

ఉ. వేఁడిన లాభ మింతయు లభింపనియప్పుడులోకమందు నె
వ్వాఁడును జేయ శక్తిఁ గలవాఁ డయి యుండనియప్డు మార్గ మే
జాడను గాన రా నపుడుఁ జావఁ దలంచినవాఁ డొకండు గా
కేఁ డిటువంటిమార్గమున కెన్నికఁ జేయక యుండుఁ జెప్పుఁడీ !

నామ—అది యట్టిదియే గాని సభాముఖంబునం దానిఁ జర్చించి తీర్మానించుకొందము.

కేల్కార్—సరే కానిమ్ము. రా నున్నదిగదా సూరతుమహాసభ! దానివైభవముం జూడక పోవుదుమా? (తెరలో ఘంటానాదము)

నామ—కాలాతిక్రమణ మైనది. భోజనావసరఘంటానాదము వినవచ్చుచున్నది. నేఁటి కీయుత్సవము చాలింతము. (లేచును.)

అందఱు—(లేచి నడచుచున్నారు. తెరపడుచున్నది.)

ఇది చతుర్థాంకము.

శ్రీరస్తు.

# తిలకమహారాజనాటకము.

## పంచమాంకము.

స్థలము—పూనాలో నొకభవనము.

(తిలకు. కేల్కారును ప్రవేశించుచున్నారు.)

తిల—కేల్కార్ !

శా. దాదాభాయిసమక్షమందు నిరు డేకాతన్మాత్రమై కానియ
ట్లాదేశీయమహాసభాభవనమం దా కాళిఘుట్టంబునన్
స్వాదుప్రక్రియ నిర్ణయించినసమస్యల్ నాల్గు నీయేం డస
ద్వాదుల్ మాని మెలంగునట్లు తెలియన్ వచ్చెన్ జుమీవార్తలన్.

కేల్కార్—హాహా ! మహారాజ !

క. మితవాదు లనెడుపేరున,
క్షితి వెలసినరిపులువారు చెప్పంగ నేలా
మతిలో నొప్పరికించిన,
గతియంతయు మాఱు నగుచుం గన్పట్టు నికన్. ౨

తిల—కాలప్రభావముగాని యెవ రేమిచేయఁగలరు చెప్పుము ?

ఉ. కాలము కూర్చు నంతయును గాలము మార్చును బేర్చి కాల మే
మూలము దేసకే నీ యని బుద్ధి యొనర్పఁగ నౌను గాని యీ
కూళలు చేసినారనుచుం గొందఱం గైకొని చెంద నాడఁగాం
బోలునె బుద్ధిమంతుఁ డగు పూరుషుఁ డెప్పుడు దారి దప్పునే. 3

కేల్కార్—కాలప్రభావ మని యుపేక్షించుట నామతంబు గాదు వినుము.

సీ. నాగపూర్వాసులు నయ మొప్ప దేశీయ,
సభ తమపురమున జరుగనెంచి

మించినవేడ్క నీమీఁదిగౌరవమున,
నిన్నధిపతిఁ గాఁగ నెన్నుకొనిరి
దానికి సైపక మానసంబున సురేం,
ద్రప్రభృతులు మెహ తా ప్రబోధ
మునఁ దాఱుమాఱుగాఁ బొనరించి దేశీయ,
సభ సూరతుకు మార్చి రభయు లగుచు
తే. నిన్నుఁ గాదని నీమీఁద నెగులు పెట్టి
త్రోసిరా జని రసవిహారీఘోసు దాని
కధిపతిగఁ జేసి తమవాద మది దలిర్పఁ
జేసికొన నుండి రని వింట క్షితిసురేంద్ర! ౪

తిల—అవును. నాగపూరునఁదమయాటలు సాగిరావని మెహ తాజన్మస్థాన మైనసూరతుం జూచుకొన్నారు.

కేల్కారు—తొల్లి శివాజీచే నోటు వడినసూరతుపౌరులు నీవు శివాజీయవతారంబ వని నీపై ద్వేషించి నిన్నుఁ ద్రోసిరా జని ఘోషుం గోరుకొనిరి. లజపతిరాయనిం గోరుకొనినజాతీయవాదులవాదంబు వితథం బయ్యె.

తిల—ముంజీప్రభృతులు నాగపూరులో నన్నుఁ గోరుకొనిన నాఁడే నన్నుఁ గాదని లజపతిరాయనిఁ జెప్పితిఁ గదా—

క. లాలాలజపతిరాయఁడు,
సోలుగ దేశీయసభకు ముఖ్యుఁ డగుటకున్
బోలనివారై తత్ప్రీతి
కూలురు, గావించి రట్లు కువిధం బకటా. ౫

(తల పంకించి) కాని మ్మెట్లు కా నున్నదో చూతము గాక.

కేల్కారు—అయ్యో! మనకృష్ణస్వామయ్య గోకిలేప్రభృతులు వినుచుండఁగాఁ దిలకుఁ దేశీయమహాసభాంగనకు వ్రణావృతం బైనపేరోలి వంటివాఁడు కావున—

క. మందులకుఁ గానిదానిం,
బొందుగ ఖండించిపుచ్చి ¶ పూర్ణారోగ్యం
బొందం జేయఁగ నెప్పెడు
నెందుం బరికించి చూడ ¶ నీసమయమునన్. ౬

అని బోధించినాఁడఁట మహారాజ!

తిల—ఎవ రెట్లాడుకొన్న నేమి? మనము చేయనున్నదాని నె ట్లయినఁ జేయక మానుదుమా?

కేల్కార్—ఏమిచేయఁ గలము. కలకత్తాలోఁ దీర్మానింపఁ బడిన స్వరాజ్యము, స్వదేశవస్తుస్వీకారము, విదేశవస్తుబహిష్కారము, జాతీయవిద్య, యనునాలుగుతీర్మానములం గూర్చి గోకిలే చెప్పిన చొప్పునఁ దాఱుమాఱు చేయం దలంచి యున్నా రఁట! మన మట్లు కాకుండ, అరవిందఘోషు, లజపతిరాయి, కపర్ది, మోతీలాలుఘోషు మొదలగువారిం గూడి కార్యతంత్రం బరయఁ బ్రయత్నింప వలయు నని విన్నవించుచున్నవాఁడ.

తిల—నీవు చెప్పినట్లు తలంచువారిలో మెహతా, వాచా, గోకిలే, బెనర్జి, చింతామణి, కృష్ణస్వామి ప్రభృతులు ముఖ్యు లని యూహించెదను.

కేల్కార్—చిత్తము.

తిల—సరే! మనము మునుమున్న పోయి సూరతుపురవాసు లెల్ల మనకుం దోడుపడునట్లు చేయుదము. అట్లు కాకున్న నెట్లు చేయ వలయునో యట్లు చేసివత్తము. రమ్ము.

ఇద్దఱు—[నడచుచున్నారు] అపటీక్షేపంబున సూరతులో నొక సభాస్థలము, సభ్యులు కనఁ బడుచున్నారు.

అరవిందఘోషు—[అగ్రాసనాధిపతియై] దేశీయులారా! ప్రస్తుతస్థితి ననుసరించి యిప్పుడు మనయీసభ ముఖ్యమైనది. దీనివలన

దేశీయమహాసభ యెట్టిస్థితిగతులం బొందనున్నదియో యెల్లవారికిఁ దేట తెల్లం బగున ట్లాయావిషయంబు లెల్ల లోకమాన్యుఁ డుపన్యసించుం గావున నెల్లరును సావధానచిత్తులరై యాకర్ణింతురుగాక.

తిల—(లేచి యుపన్యాసవేదికం జని) మిత్రులార! సూరత్పురీవాసులార! నేను మీకు మిత్రుఁడను గాని శత్రుఁడను గాను. నాకు లోకమం దెవ్వరును శత్రువులు లేరు. కావున మిత్రవాక్యమున నాదరం బుంచి విన నవధరింపుఁడు. గుణదోషంబు లెఱింగి మీ యిచ్చ వచ్చినమచ్చునం బ్రవర్తింపుఁడు.

సీ. మనదేశమునఁ గల మనుజు లెల్లరు తమ,
పడుపాట్లు చర్చించి కడిమి మెఱసి
పడి దాస్యమునుండి విడుగడ గలిగి స్వే,
చ్ఛాజీవనముఁ జేయఁ జాలి మనుట
కొక సాధనంబుగా నుంటకు దేశీయ,
సభ యొప్పఁ గొన్నివర్షములనుండి
మును మున్న యది దొరతనమువారిని వేఁడి
బ్రదుక బోధించెను పద్ధతి నగు
తే. నట్టిపద్ధతి పనికిరా దనుచు నే భ
గీరథప్రయత్నము చేసి కీర్తనీయ
మైన జాతీయవాదంబు నందు నిలుప
నూతనోద్యమమున నది ఖ్యాత మయ్యె. ౨

ఇది యిట్లుండ నిరుడు కలకత్తాలో జరిగిన దేశీయమహాసభలోఁ దీర్మానింపఁ బడిన స్వరాజ్యాదిసమస్యలు నాలుగుం గొందఱు మితవాదులు జాతీయవాదులపై ద్వేషించి భిన్నంబు లగునట్లు చేయుటకు సంకల్పించి యున్నారఁట. స్వరాజ్యాదిసమస్యలు దేశీయసభలోఁ బరిపూర్ణచర్యకుం దేనినాఁడు మనదేశమున కెన్నఁటికిని మేలు గలుగదు. మనకు

జరితార్థత లేదు. మనకుఁ గనడాదిరాజ్యముల కున్నట్టిస్వరాజ్యమక్కఱ లే దనియుఁ బ్రిభుత్వమువారిచేతిక్రిందఁ జేయి చాచి యుండు స్వరాజ్యము కావలె ననియు మనమితవాదిసోదరులు పలుకుచున్నారు. ఇట్లనుట కేమియర్థమో తెలియదు. వారెల్లఁ బిఱికిపందలై తమకుఁ బ్రభుత్వమువారివలన నేమివచ్చునో యని యిట్లు స్వార్థపరాయణులై పలవరించి పలుకుచున్నారు. వారికింకను గొన్నివందలసంవత్సరములకుఁ గాని మనము బ్రిటిష్ప్రభుత్వమువారిచేయి విడిచి బ్రదుకఁ జాలమని సంపూర్ణమైనయభిప్రాయము. అట్టివారియభిప్రాయానుసారముగా మనము ప్రవర్తించినయెడల మన కెప్పటికిని ముక్తి గలుగ నేరదు. మనదేశ మితరదేశములవలెం గాక హీనస్థితిఁ బొంది యుండ వలసివచ్చును. మనప్రభుత్వమువారు మన కేయింతయు నిచ్చువారు కారు.

మ. ఒకదేశంబు మఱొక్కదేశమును దా నోముంగఁ బో దెన్న నిం
కొకకాలమునకైన నయ్యది స్వలాభోత్పత్తికై చాల చూ
చుకొనుం గాని యొకళ్ల లాభమునకుం జూడంగఁ బో దెంతపే
ర్మికి నైనం బరపాలనంబు సుఖమర్పింపంగ లో నెంచునే. ౮

మన మట్టి స్వపరిపాలనమునకై మిక్కిలి పాటుపడ వలయును. స్వార్థత్యాగము చేయ వలయును. ఎఱుంగక మితవాదు లిట్లు చేయుచున్నారని వారిపైఁ గలకోపంబున దేశమునకు మహోపకారము చేయుచున్నదేశీయమహాసభను జెడఁగొట్ట వలయు నని నాయభిప్రాయము కాదు. కావున మన మెల్లరము నేకగ్రీవముగా నుండి యీదేశీయమహాసభలో స్వరాజ్యాదిసమస్యలు మార్పరా దని చెప్పుదము. చెప్పినట్లు వారు చేసితిరేని సంతోషము; కాదేని యప్పటి కెట్లు చేయ వలయునో యట్లు చేయుటకు మీరు జాతీయవాదులతోఁ బాటు సిద్ధసంకల్పులై యుండుటకుఁ గోరుచున్నవాఁడ. కాని, మునుమున్న మనమే ఖడ్గంబునకు దిగుట న్యాయంబు గాదు. నేనుం, గపర్దియును,

మో తేలాలు, నరవిందుండునుం బోయి కార్యవాదంబున రాయబారంబు నడప నెంచితిమి. దానికి వా రెవ్వరును జెవి యొగ్గరని నే నెఱుంగుదును. అయినను మనము చేయఁ దగినది చేయకుండఁ దగదు. తనమాటబడిని ధృతరాష్ట్రాత్మజుఁడు సంధి చేసికొనఁ డని యెఱింగినను శ్రీకృష్ణభగవానుఁడు లోకాపవాదభయంబునం జేసి రాయబారంబు వోయి యున్నాఁడు కదా ! అట్లనే మేమును మా కార్యముం దీర్చుకొని రాఁ దలంచితిమి. మీమీయభిప్రాయము లెట్లుండునో విన నభిలషించుచున్నవాఁడ—

మ. మనదేశం బిది దాస్యముల్ విడిచి సన్మానంబునుం బొందగా
మనముం జేయుదు రేని స్వార్థపరులై మా నేదకుండంగ జీ
వనముం జేయఁ దలంతు రేని సదభిప్రాయంబు నా కిచ్చి నా
యనుజుల్ మీరని మెచ్చుమచ్చునఁబర్క ప్రార్థింతుమిమ్మెల్లరన్.

అందఱు—(కలకలము చేయుచున్నారు.)

పౌరుఁడు—లోకమాన్య ! మీయుపన్యాసంబునం జేసి మీమత మెట్టిదియో మాకుఁ దెలియవచ్చినది. మే మందఱమును మీమతమంద యుండ నెంచితిమి. మీరు మాకుఁ బరమేష్టు లని నిశ్చయించితిమి. మీయభిప్రాయమే మాయభిప్రాయము. కాని, మీరాయబారము శ్రీకృష్ణునిరాయబారమువంటిదే యగు నని యెఱుంగుదుము. అయినను మీవంటి రాజకీయవేత్తలకుఁ జతురుపాయంబులు ననుసంధింప నొప్పును గాన మీ చెప్పినట్లు రాయబారమునకుఁ బోయి రా వలయు ననియే చెప్పుచున్నారము.

అరవిం—జాతీయవాదుల కెల్ల గురుతిలకంబైనమనమహారాష్ట్రతిలకుని మహోపన్యాసంబునం జేసి మీ కంతయుం దెలిసియున్నయది. కావున మీరును దేశక్షేమాభివృద్ధికై మాతోఁ బాటు పాటు పడవలయును జుండీ ! (అని లేచును.)

అందఱు—(లేచి నడచుచున్నారు. తెర పడుచున్నది.)

ఇది పంచమాంకము.

శ్రీరస్తు.

# తిలకమహారాజనాటకము.

## షష్ఠాంకము.

### స్థలము దేశీయమహాసభాభవనము.

(నానాదేశాగతప్రతినిధులు పదియాఱువందలు ప్రేక్షకులు పది వేలు కొందఱు స్త్రీలును గూడియుండ సభ కనుపించును. అంతఁ గొంతసేపటికి దేశీయభటులు వచ్చి తొలఁగుఁడు తొలఁగుఁ డని దారి చేయుచుండ రసవిహారఘోషు, మెహతా, వాచా, సురేంద్రనాథబెనర్జి, గోక్లే, మొదలగువారు వచ్చి వేదికనలంకరించుచున్నారు.)

అందఱు—(లేచి కరతాళధ్వనులు చేయుచున్నారు)

స్త్రీలు—(జాతీయగీతముం బాడిరి)

త్రిభువనదాసమాలవీ—(ఆహ్వానసంఘాధ్యక్షుఁడు లేచి)

సీ. భారతులార! మా సూరతుపుర మాది,
నుండి వర్తకమున దండి కెక్కె-
నిటఁ బ్రెంచివారు పిమ్మటఁ బోర్చుగీసువా
రాంగ్లేయులును వర్తకాలయములు
గట్టి వ్యవహరించి రెట్టిమెడర్క సిరి,
తోఁ దులఁదూఁగునీదొడ్డవీట
నిరువదిమూఁడవ వరసభ జరుప మీ
రెల్లరు నతిథులై రిచట మాకు
తే. సంతసించుచు మేము మా శక్తి కొలఁది
సత్కరింపఁగ నుంటిమి స్వాంతమందు

సిపుడు మీరు మాలోపము లెల్ల సైచి
మమ్ము మన్నింప వేడుదు మిమ్ము నెమ్మి.

(అని కూరుచుండి లేచి) నేఁ డీసభ పదునొకండుగంటలకుఁగూడఁ దగినది యైనను సింధుదేశమునుండి వచ్చిన ప్రతినిధి యొకండు హఠాన్మరణంబు నొందె. దానం జేసి యింత కాలవిలంబన మైనది. ఇప్పుడు సభాధ్యక్షు నెన్నుకొన వలయుంగదా! అక్కార్యము బరోడాసంస్థానోన్నతన్యాయస్థానాగ్రీయన్యాయమూర్తి యగుదివాన్ బహద్దరు అంబాలాల్ సేకరలాల్ దేశాయి గా రొనర్చుటకును సురేంద్రనాథబెనర్జీ, మోతేలాల్ నెహ్రూగారును దానిం బలపఱుచుటకును గోరుచున్నాను. (అని విశ్రమించుచున్నాఁడు)

అంబా—(లేచి) కలకత్తావిశ్వవిద్యాలయమందు ఘనత కెక్కి యాంగ్లేయవిద్యయందుమహాపాండిత్యమునుసంపాదించి న్యాయశాస్త్రమందుఁ దనతో సమానుఁడు లేఁ డనుకీర్తికిం బాత్రమై న్యాయవాదులలో నగ్రేసరుఁడై (సభలోఁ గలకలము) ధర్మశాస్త్రోపన్యాసములుచేసి యుద్గ్రంథములు వ్రాసి, శాసననిర్మాణసభలో సభ్యుఁడై (సభలో హుస్సు రని శబ్దము) ప్రజాపక్షమున ననేకోత్తమకార్యంబు లొనర్చి, లక్షలకొలఁదివిత్తము రసాయనశాస్త్రాదివిద్యలకు దానంబు. చేసి, ప్రఖ్యాతిఁ గాంచిన రస—(సభలోఁ గోలాహలము) విహారఘోషుగారు (సభలో వద్దు. వద్దు. అని కేకలు) ఈసభ కధ్యక్షులుగా నుండుటకుం గోరుచుఁ దీర్మాన ముపపాదించుచున్నాను. (సభలో మహాశబ్దము).

సురేంద్ర—(లేచి యుపన్యాసవేదికపై కెక్కుచున్నాఁడు. సభలో దారుపాషాణాదిశబ్దములు, హుస్సురని, శబ్దములు, కేకలు, ఈలలు, పెచ్చుపెరుగుచున్నవి.) మహాజనులారా! రసవిహారఘోష్—(మాటాడ వలదు. కూరుచుండుము. అని కేకలు) సర్వసమర్థుఁడు. విద్యాధికుఁడు— (సభలో—చాలు చాలు. కూరుచుండుము. నాగ

పూరు జ్ఞాపకము లేదా? మిథునపూరు మఱచితివా? అని కేకలు. అల్లరి.)

త్రిభు—[ఘంటనాదము చేయుచు] శాంతింపుఁడు. శాంతింపుఁడు [అనియుచ్చస్వరంబునఁ బలుకుచున్నాఁడు.]

సురేం—[ఆయల్లరిలో లేచి యుచ్చస్వరంబున] దేశీయమహాసభ యిరువదిసంవత్సరములనుండి దేశమునకు మిక్కిలి పాటుపడుచున్నది. (చాలు: చాలు. శాంతింపుము. అని శబ్దము) దానివలన జనులకు దేశాభిమానము, నైకమత్యమును గలిగినది. (చాలాసంతోషము ఊరకుండుము. అని శబ్దము) ప్రభుత్వమందుఁ బ్రజానుకూల మైనమార్పులు కలిగినవి. (హ హ హ యని శబ్దము) అట్టియీసభకు ఘోషుగారగ్రాసనాధిపత్యము వహింతు రని కోరుచున్నాము. (హి హి హి యని మహాశబ్దము)

మోతే—(లేచి వేదికపై కెక్కి) భారతీయులార! శాంతించి నామాటలు వినుండు. రసవిహార— (చాలు చాలు అని శబ్దము) ఘోషుగా రన్నిటియందును మితవాదియే. (సంతోషించినార మూరకుండుము అని కేకలు) కాని దానములో నతివాదియే. అతఁడీసభకు నధిపతిగా నుండఁ దగును (తగదు తగదు. అని శబ్దము.)

త్రిభు—సభ్యులారా! ఇందు మీయంగీకారము కలదా?

మితవాదులు—కలదు. కలదు. (అని పలికిరి.)

జాతీయవాదులు—లేదు లేదు. (అని పలికిరి.)

త్రిభు—ఈవిషయము తీర్మానింపఁ బడినది గావున రసవిహారఘోషు నధ్యక్షునిగఁ జేయుచున్నాను. (అని ఘోషును లేవదీసి యగ్రాసనమునఁ గూరుచుండఁ బెట్టుచున్నాఁడు) (కలకలము హెచ్చును)

రస—(అగ్రాసనం బధిష్ఠించి లేచి) సోదరప్రతినిధులారా!

సభాసదులారా! నా కీగొప్పగౌరవ మొసంగినందులకు వందనము లర్పించుచున్నాను.

కొండలు—(సభలో) నీయుపన్యాసమున కిదియే మొదటివాక్యమును జివరవాక్యమును. (అన్ని పెద్దశబ్దము) అంతలో:—

తిలకు—(మెఱపు మెఱిసినచందాన నుపన్యాసవేదికపై కుఱికి అగ్రాసనాధిపతి కడ్డుగా నిలిచి) సభ్యులారా!

శా. అంగీకారము లేనివాఁడ నయి నే నగ్రాసనాధీశు న
న్యాయం గూర్పం దలపోసి మాలవికి నెంతో ప్రీతిమై వ్రాసి లే
ఖం గై సేయఁగఁ బుచ్చినం గొనియు న్నా కై చూపు రానీక న
న్నుం గైకొకతఁడుండె న్యాయమునకున్ దూరంబుగాఁబోవుచున్.

ఆ. మార్పుఁ గోరి నేను మాటాడఁగా నెంచి
వచ్చినాఁడ నిటకు వార కిట్లు
లోఁగ నున్నదాని నే గతినేనియుఁ
జెప్పఁ జూతు నిపుడు చెలిమిఁ జేసి. 3

త్రిభు—(తిలకుం గోపదృష్టిం జూచుచు)

క. సభ నాగుపొంటె వ్రాసితి
నభయుఁడవై చెల్ల దట్టులని నే నంటిన్
విభవము వో నిట వచ్చి పరి
తిభ మెయి నిటు మాటలాడఁ దిపురుడె తిలకా. ౪

నీకు నిటవచ్చుటకును మాటాడుటకును నధికారము లేదని నేను నొక్కి వక్కాణించుచున్నాను.

తిల—అగ్రాసనాధిపతియెన్నికకు సవరణము నే నుపపాదింతు నని కోరఁగా నీ విట్లు సత్యదూరుండవై సభ నాగుటకుఁ గోరియుంటి వని ప్రల్లదంబు లాడి నా కిట వచ్చుటకు మాటాడుటకుఁ గూడ నధికారము లేదంటివి!

శా. అధ్యక్షుండవు గావు నీ విపుడు మా టాడంగ రా దంచులో
నధ్యాహారము చేసికొంచుఁ గడిమిన్ వ్యాహారముం జేసి నన్
బోధ్యస్వాంతునిఁ జేయ నెంచితివి నీ! పొమ్మా వెవం డిట్లనన్
సాధ్యాసాధ్యవిచారమున్ సలిపి వి జ్ఞాతుండు ఖ్యాతుం డగున్.

రస—(సంభ్రమమున లేచి) అట్లయిన నేఁ జెప్పుచుంటి నీకిట మాటలాడుట కధికారము లేదు లేచి పొమ్ము.

క. న్యాయవిరుద్ధం బగుగతిఁ
బోయెదు ఘనుఁ డైన శిక్ష బొందఁగ నర్హుం
డై యుండు నాజ్ఞ లే కిట
నీయుండుట తప్ప టంచు నే వచియింతున్. ౬

తిల—(రసవిహారఘోషుదిక్కు మొగంబై) ప్రతినిధులచే నగ్రాసనాధిపతిగా నీ వెన్నుకోఁ బడలేదు. కావున నీ కిట్లు పలుకుట కధికారము లేదు. లే దని యీ ప్రతినిధులకడ విన్నవించుచున్నాను.-

ఆ. పోలు ననుచు లేని పోనియుద్యోగంబు
మీఁద వేసికొంటి వాద మఱచి
తగనిపరుగులెత్తఁ దలఁచి నీ వాదలఁ
గొఱవిఁ బెట్టి గోకి కొనకు మయ్య. ౭

అందఱు—(సభలోఁ గోలాహలము చేయుచున్నారు.)

(అంత మితవాదియువకులు లాటీలు పుచ్చుకొని తిలకుం బరివేష్టించి గాఢకేకలు వేయుచు కొట్టు కొట్టు మని పడఁ ద్రోయుటకుఁ బ్రయత్నించుచున్నారు.)

లాలాభాగత్—(పంజాబీ—) మెఱసినట్లు వేదికపై కెక్కి-(ప్రత్యాలీఢపాదుండై చేతులు బిగియఁ బట్టి) మూర్ఖులారా! మాతిలక మహారాజుమీఁద దెబ్బ పడిన మీ రెట్లుందురో చూచుకొనుఁడు. (అని సింహగర్జనము చేయుచున్నాఁడు.)

రస—(బల్లమీఁది కెక్కి గంట వాయించి గద్గదస్వరముతో నేమో పలుకుచున్నాఁడు. ఎవరికిని వినుపింప లేదు.)

గోకిలే—(మితవాదులకోపమును శాంతింపఁ జేయుటకుఁ బ్రయత్నించి తిలకునిఁ గాపాడువాడుంబోలె వాని కడ్డుగా - రెండుచేతులును జాచి నిలువఁ బడుచున్నాఁడు.)

తిల—ఆ. భేల! నీదుసాయ కే మేల నా కిప్పుడు
సవతతల్లి ప్రాపు చందమునను
జూప వచ్చి తౌర నీపరిపాటికి
నవ్వ వచ్చుచుండె నమున్న మవల.

(వక్షస్థలమునఁ జేతులు కట్టుకొని, నిర్లక్ష్యమును సూచించుచు, నించుక వెనుక కొఱఁగి, యప్పుడు గఱచి, మోము బిగించి, మోఱ యెత్తి చూచుచు నిలువంబడి) నికృష్టులారా! మీయిష్టము వచ్చినట్లు చేయుఁడు మీరు గా దిపుడీస్వర్గమర్త్యపాతాళములలోనివా రెల్లం గూడి వచ్చినను నన్నిటనుండి కదుప సమర్థులు గారు వినుండు:—

శా. కన్నుం గానక కండకావరమునన్ గర్వించి మీ రెల్లరున్
నన్నుం గొట్టఁగ వచ్చియుంటి రనుచున్ వర్ణింపగా నయ్యె మీ
కన్నాతల్ గని భీతి నొందుచును దుస్సాహర్యంబు గావించుమి
మ్మౌన్నత్యంబున నుండ నిత్తునె జగంబోహో యనం జేయనే.

చ. తగ దిటు మీకు స్వార్థమును త్యాగము సేయుగ లేసయట్టి వై
వగ పిసుమంత లేక తన వా రని యెంచక దేశభక్తులన్
దెగడి పరప్రబోధమునఁ దిన్ననితోవలఁ బోక ద్రోహముం
దగిలి స్వదేశదూరు లయి తప్పి పరంబున కుంటి రక్కటా! ౧౦

జాతీయవాదులు:—(సముద్రమువలె ఘూర్ణిల్లుచు సింహనాదములు గావించుచున్నారు.)

పాదరక్ష—(పక్షివలె జివ్వు రని ధ్వనితో నెగిజివచ్చి మహాత్ముపక్కనుండి దూసికొనిపోయి సురేంద్రనాథబెనర్జీ చెంపమీఁదఁ దగులుచున్నది.)

జాతీయవాదులు—(అంతలో సముద్రతరంగములవలెఁ బెచ్చు పెఱిగి యుపన్యాసవేదిపైకి లంఘించి హుంకారములు చేయుచున్నారు)

సభ—(చెల్లాచెదరై పోవుచున్నది.)

స్త్రీలు—(గడగడ వడంకుచుఁ బాఱిపోవుచున్నారు.)

సురేంద్ర—మాలవీప్రభృతులతో రసవిహారఘోషం దోడ్కొని పగర్చుచు వెనుకదారిం బాఱిపోవుచున్నాఁడు.)

జాతీయవాదులు—తిలక్ మహారాజుకీ జై (అని జయజయశబ్దములు పలుకుచుఁ దిలకుని దమభుజంబులపై నెక్కించుకొని నడచుచున్నారు.)

(సభలో) నెల్లవారు నెవరిపక్షమువాఁ డెవ్వరో తెలియ నేరక తమయెదురఁ బడినవారి నెల్లఁ గుర్చీలతోఁ బల్లలతోఁ గఱ్ఱలతో, నితర సాధనములతో నన్యోన్యముం గొట్టుకొనుచున్నారు. రక్తము ప్రవహించుచున్నది. కుర్చీలు విఱుగుచున్నవి. కఱ్ఱలు ముక్కలగుచున్నవి. మహాధ్వని మిన్ను ముట్టుచున్నది.)

రక్షకభటులు—(ముప్పదిమందివచ్చి) చలో! చలో! (అని కేకలు వేయుచు నందఱను సభాభవనమునుండి వెళ్ళఁ గొట్టుచున్నారు.
(తెరపడుచున్నది.)

ఇది షష్ఠాంకము.

శ్రీరస్తు.

# తిలకమహారాజనాటకము.

## సప్తమాంకము.

స్థలము పూనాలో నొకవీధి.

[ఇద్దఱు పౌరులు ప్రవేశించుచున్నారు]

మొదటివాఁడు—వ

మానదు సుమీ ! మొన్న సూరతులో జరిగినది సామాన్యమా ?

రెండవవాఁడు—సామాన్య మెట్లగును ? తిలకుం డంగబలము నర్థబలము బుద్ధిబలము గలవాఁడుగావుననే తన్నుఁ గొట్టవచ్చినముష్కరులబాఱిం బడక స్వరాజ్యాదిసమస్యలకుం గానిసభనుభిన్న భిన్నముగాఁ జేయఁ గలిగినాఁడు.

మొద—మితవాదు లాకార్పణ్యముచేతనే కాఁబోలు తిలకుం గూర్చి దొరతనమువారితో నెన్నో నేరములు కల్పించి చెప్పినా రని వింటిని.

రెండ—అందుచేతనేగదా తిలకున కిట్టియిక్కట్టు వచ్చినది.

మొద—(సంభ్రమముతో) ఏమియిక్కట్టు వచ్చినది? చెప్పుము.

రెండ—అతనిపై నొకయభియోగమువచ్చినది. అదిబొంబాయి హైకోర్టులో విచారింపఁ బడుచున్నది.

మొద—అభియోగస్వభావమేమి ? సాకల్యముగాఁ జెప్పుము.

రెండ—సీ. క్రోధంబునం జేసి కుదిరామబోసు కిం

గ్స్ఫర్డు నెట్లయినఁ జంపఁగఁ దలంచి

ముజఫరుపూరులోఁ బ్రొద్దుగ్రుంకెడువేళ

హయశకటంబుపై నరుగుచున్న

దొరసానులం గాంచి దొర యని శంకించి
బాంబు ప్రయోగించి పఱచె నంతఁ
దక్షణంబున హూణ తరుణు లిద్దఱు నేలఁ
బడిరి ప్రాణంబులన్ బాసి దాన
తే. హిందుదేశంబునం గల యెల్లవారు
బాంబు వేయుట తప్పని పలికి దూరి
రపుడు తిలకుండు తప్పని యాంగ్రుడు దెగుట
కుల్లమునయందు మిక్కిలి తల్లడిల్లె. ౧

అంతఁ గేసరి కెవ్వరో వ్యాసములు వ్రాసి పంపిరి.అందుఁ"గుదిరాము చేసినతప్పువంటితప్పు హిందుదేశమం దెవ్వఁడుం జేసి యుండలే దిట్లు రష్యాయున్నగు దేశంబులం జేయుచుందురు. ఇట్టిదుష్టకార్యములు ప్రభుత్వముయొక్క-మూర్ఖత్వముచేతనే హిందూయువకు లభ్యసించి యుందురు. దీని కెద్దియో పెద్దకారణ ముండితీరును. అట్టికారణము గలుగకుండఁ జేయుభారము దొరతనమువారిమీఁదనే యున్నది. వారు తమనిరంకుశాధికారముం జూపుచుఁ బ్రజలను బాధింపక వారికి స్వాతంత్ర్య మిచ్చినచో నిట్టియరాజకపుకార్యములు పుట్టియుండవు." అని మొదలైన సంగతు లున్నవి.

మొద—అది రాజద్రోహ మని తిలకుపై నభియోగముం దెచ్చిరా? ఆవ్రాఁతలన్యులవి గదా ?

రెండ—ఆవ్రాసినవారిం జెప్పక తిలకు వానికర్తృత్వముఁ దానే వహించెను. ప్రభుత్వమువారు— తిలకు బాంబుప్రయోగమును సమర్థించుచున్నాఁ డని యపార్థము చేసి జాతీయవాదుల కగ్రేసరుం డగునతని నడఁగఁ ద్రొక్కఁ దలంచి వానిపై మూఁడుగతుల నభియోగములం దెచ్చి పట్టుకొనిపోయినారు.

మొద—ఎక్కడ వానిం బట్టుకొనినారు.

రెండ—కాల్పత్రికాధిపతి యగుపరంజిపాయిపై నేరము మోపఁగా నాతనికిసాయము చేయుపొంటెఁ దిలకుండు బొంబాయికిం బోయి సర్దారుగృహమందు నివసించియుండె. అప్పు డొకనాఁడు రాత్రి వానిం బట్టుకొని పోయిరి.

మొద—జామీనుపై విడువలేదా ?

రెండ—1897 వసంవత్సరమున నతనిపైఁ గేసు వచ్చినప్పుడు దేవారు న్యాయవాదిగ నుండి న్యాయమూర్తి యైనబదరుద్దీ టయాబ్జీ నడిగి జామీనుమీఁద విడుదలఁ జేయించినాఁడు. ఇపుడు నవే చట్టములు. ఆ దేవారే యిపుడు న్యాయమూర్తి. తానే జామీ నంగీకరించినాఁడు కాఁడు.

మొద—కేసు విచారణప్రారంభ మైనదా ?

రెండ—నేఁటి కెనిమిదిదినములనుండి విచారింపఁ బడుచున్నది. ఆం దేడ్వురు తెల్లవారును, ఇద్దఱు పారసీకులును బంచాయతీదార్లుగా నియమింపఁ బడిరి. వారికిని దేవారునకును మహారాష్ట్రభాష తెలియదు.

మొద—తిలకునకు న్యాయవాది యెవరు ?

రెండ—న్యాయవాది లేఁడు. తానే న్యాయవాదియుఁ దానే ముద్దాయియును.

మొద—ముద్దాయియై వాదించుట సాధ్యమా ?

రెండ—తిలకున కసాధ్యములు లేవు. నూర్గురు న్యాయవాదులు మేలు మే లనుచుండ నిరువదిగంటలకాలము తనపై వచ్చినయభియోగముం గూర్చి వాదింపఁ జాలినాఁడు. దొరతనమువారిమహారాష్ట్ర భాషాపరివర్తకుఁడు భాస్కరవిష్ణుజోషి సాక్షిగా వచ్చినప్పుడు వాని తూసి ఱంపానఁ బెట్టి తుదకు వానిచేసినవ్యాసపరివర్తనము తప్పని వానినోటనే చెప్పించి నీకు మహారాష్ట్రము తెలియ దనియు నా

వ్యాసములకు నీయింగ్లీషు సరి లేదనియుం జెప్పి యొప్పించినాఁడు. దొరతనమువారిన్యాయవాది బ్రాన్సన్ కూడఁ దిలకుమేధాశక్తి కచ్చెరువుపడినాఁడు.

మొద — తీర్పెప్పుడు చెప్పుదురో ?

రెండ — నేఁడు దొరతనమువారిన్యాయవాది సారాంశమును జెప్పినమీఁదఁ గదా తీర్పు చెప్పుట.

మొద — నేఁడు నే నటఁ బోవ నెంచితిని. నీకుఁ గూడ రా నభిలాషము గలదా ?

రెండ — నేను బ్రతిదినము బోయి వచ్చుచునే యున్నాను.

మొద — అట్లయినఁ గాలాతిక్రమణము గాకుండ ధూమశకటంబునకుం బోవుదము రమ్ము. హాహా ! కాలమహిమ !

సీ. చలిచీమనేనియుఁ జాఁ ద్రొక్కనివ్రతంబు
పుట్టుతోడన నేర్చి నట్టివాఁడు
అన్నదమ్ములు వోలె నఖిలజనంబుల,
ననురాగమునఁ జూచు నట్టివాఁడు
దూషణభూషణా దులతగులంబున,
కందనిమది గల యట్టివాఁడు
తన కెంతలాపదల్ తారసించినఁ గాని,
పట్టుచు విడువని యట్టివాఁడు
ఆ. అనృత మన్న నెఱుఁగ నట్టిమహాత్ముఁడు
లోకమాన్యుఁ డఖిల లోకనుతుఁడు
మాతృదేశమునకు నీతీరుగాఁ బాటు
పడుచు నుండె నెట్లు పడును యింక.

ఇద్దఱు — (నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

స్థలము బొంబాయి హైకోర్టు.

(రక్షకభటాధ్యక్షుఁడు డాక్కుప్రక్కను, పంచాయతిదార్లొక ప్రక్కనుం గూరుచుండ, న్యాయవాదులు క్రిందుగా నిరుగడ నివసించి యుండ, భటులం దందు నిలిచియుండఁ గొందఱు ప్రేక్షకులునుం గూడి యుండఁ దెర యెత్తఁబడును. అంత సంజ్ఞాపూర్వకముగా దేవారు ప్రవేశించి యున్నతస్థాన మధిష్ఠించుచున్నాఁడు. ఎల్లరు లేచి నమస్కరించి విశ్రమించుచున్నారు. విచ్చుకత్తులవా రుభయపార్శ్వంబుల నుండి తిలకుం దెచ్చి యెదుర నున్నయినుపబోనులో (నిలువం బెట్టుచున్నారు.)

దేవారు—(తిలకుం దిలకించి) నీవు పంచాయతీదార్లతో నేమి చెప్పెదవో చెప్పుము.

తిల—(పంచాయతీదార్లదిక్కు మొగంబై)మహాశయులారా! నే నివివఱ కైదుదినంబులనుండి మాటలాడి మీకు మిక్కిలిశ్రమగలిగించి యుందును. మీరు కడునోపికతోఁ నేఁ జెప్పినదంతయు సావధానముగా వినినందులకు మీకు వందనము లర్పించుట నాప్రథమకృత్యము. నేను మీయమూల్యమైనకాల మిట్లు వృథ చేయక పోవుదునుగాని దేశాభివృద్ధికొఱకు దానియందలియభిమానముచేత నిట్లు చేయవలసి వచ్చినది. ఇట్లు చేసినందులకు నన్ను మన్నింతురుగాక. అభ్యాసము లేని నేనే వాదించుటచేత నాచెప్పినవిషయములలోఁ బెక్కులోపము లుండ వచ్చును. నాకేసులో నింతయును దాపక యున్నది యున్నట్లు విస్పష్టముగా విన్నవించియుంటిని. నావ్యాసములు సనాతనాచారమును బోధించుచున్నవి. కాని నిరంకుశాధికారులకుఁ బ్రజలకును గలపోరాటములను జర్చించి వ్రాయఁ బడినవి. ఇదిగో నాచేతిలోగ్రంథము (ఎత్తి చూపి) ఇందుఁ గీర్తిశేషులైనరావుసాహేబు మాండలిక్ గారికాలమున సర్వజనైకసభయొక్కయు నీష్టిండియాసంఘముయొక్కయు తీర్మాన

ములు గలవు. ఇదిచూచినయెడల నిట్టిచర్చ కలకాలమునుండి జరుగు చునె యున్నదిగాని క్రొత్తదికా దని మీకుఁ దెలియ వచ్చును. రాజ్యాంగసంస్కర్తలయొక్క వాఙ్మయమునుండి కొన్ని విషయములు మీసముఖమునం జదివి యుంటిని. వానికిని నేను వ్రాసినవ్యాసముల కును నేమియుభేదము లేదు. వీనిలోఁబ్రిభుత్వముమీఁదనిరసనభావము గాని ద్వేషముగానికలిగించుసంగతు లేమియును లేవు. నావ్యాసములందలి యుద్దేశములను దేశీయు లెల్లరును జాలకాలమునుండి చెప్పుచునె యున్నారు. నేను గోరునది మా దేశపరిపాలనము నిరంకుశాధికారమునం గాక ప్రజానుకూలముగా నుండవలయు ననియే. బ్రిటిష్ప్రిభుత్వముండ వలెనా? లేదా? యనువిషయమునుగూర్చి నేను జర్చించియుండ లేదు. కాని ప్రభుత్వ మేతీరున నుండవలెనో దానింగూర్చి చర్చించియుంటిని. ఇతరపత్రికలందువలెనే నాపత్రికయందును బాంబులఘోరకృత్యమును దీవ్రముగా ఖండించియుంటిని. అట్టిఘోరకృత్యమును మేమామోదించి యుండలేదు. కాని వానిని ఖండించునప్పుడు దొరతనమువారిఘోరశాస నములంగూడఖండించియుంటిని. ఇట్టియరాజకములైనబాంబులు మొద లగునవి దేశమునుండి పాఱఁ దోలవలెనన్నఁ బ్రిభుత్వములోఁ బ్రిజాను కూలము లైనరాజ్యాంగసంస్కరణము లావశ్యకము లని చెప్పితిని. ఇట్టి చో నింగ్లాండుదేశములోఁ బత్రిక లనుభవించుస్వాతంత్ర్యము నాకుఁ గూడ మీరు చూపవలెను. ఇది చాలముఖ్యమైనవిషయము. ఈపత్రికా స్వాతంత్ర్యముకొఱకు నింగ్లాండుదేశములో 1792 వసంవత్సరమునఁ బెద్దపోరాటము జరిగి తన్మూలమున నాంగ్లేయప్రిజ లీస్వాతంత్ర్యము నిప్పటికి నిర్విఘ్నముగా నిర్భయముగా ననుభవించుచున్నారు. ఇదియు నట్టివిషయమే గావున మీరు సావధానచిత్తులరై జాగరూకతతో విచారించి తీర్పు చెప్పవలెను. మీకు మహారాష్ట్రభాష తెలియక పోవుటచేతఁ గొంతకష్ట మందుఁ గలుగ వచ్చినను గొంతలాభము గలదు.

ఇంగ్లాండు దేశస్థులగు మీరు ఘోరయుద్ధము చేసి ప్రతికాస్వాతంత్ర్యము సంపాదించి యందుఁ గృతార్థులై యున్నవారు. అందుచేఁ బ్రతికా స్వాతంత్ర్యముయొక్క విలువ మాదేశస్థులకన్న మీకెక్కువ తెలిసి యుండును. అది మీరిప్పుడాచరణలోనికిఁ దేఁ గలరు. నే నిపుడు కోరునది మాదేశ పరిపాలనములో మా ప్రజల కధికార ముండునట్లు మీరు మాకు సాయము చేయవలె నని యే. మాకుఁ గష్టదశ వచ్చినది. మీసాయ మిప్పుడు మాకు ముఖ్యమైయున్నది. మీ రట్టిసాయము చేయఁ గలరు. దీని కింతచింతించుచున్నాను గాని నావిషయమై నాకింతేయును జింత లేదు. మాదేశస్థితినిబట్టి నేను వృద్ధుఁడను. నామాట కేమిగాని ముందు రాఁ బోవుతరమువారు మీ రిపు డిచ్చినతీర్పు సరియైనదో కాదో తెలిసికొనువారై యుందురు. హిందూదేశ పత్రికాస్వాతంత్ర్యమునకై జరుగుచున్న యుద్ధచారిత్రములో మీ రిపుడిచ్చినతీర్పు ప్రాముఖ్యము గలిగి యుండును. కావున నిప్పుడెక్కువ బాధ్యత మీమీఁద నేయున్నది. మీలో నొక్కరైనను ముందునకు వచ్చి నేను చేసినది న్యాయ మని చెప్పినచో నది నాకుఁ గొంతసంతృప్తి కలుగును. ఇంగ్లాండు దేశములోఁ బంచాయతీదారు లేకగ్రీవము కాని యెడల మరల విచారణము జరుగును. మాదేశములో నట్లు జరుగదు. జరుగకున్న నట్లు చెప్పుటవలన నా కుత్సాహము గలుగును. మీ రేకగ్రీవముగా నొక్క తీర్మానమే యిచ్చిన సరియే కాని నల్వురము గలియుద మని మాత్ర మాలో చింప నలదు. మీరు నాయుద్దేశములలో నేకీభవింపక పోయినను నేను రాజద్రోహము చేసినవాఁడను గా నని చెప్పుటకు మీ కధికారము కలదు. నేనును మీరును రాజకీయవిషయములలో భిన్నాభిప్రాయము గలవారము కావచ్చును. ఇపుడు మీరు విచారించునది యావిషయము కాదు మనభేదాభిప్రాయముల ననుసరించి మీరు తీర్పు చెప్పఁ గూడదు. ఇంగ్లాండు దేశములో నున్న బ్రిటిష్ప్రజలును, మాదేశములో నున్న

తెల్లదొరలును, అనుభవించుస్వాతంత్ర్యము రాజపరిపాలితులైనమా దేశప్రజలుకూడ ననుభవించుటకు హక్కు గలదో లేదో మీరు విచారింపవలెను. ఇదియే మీ రాలోచింపవలసినముఖ్యవిషయము. నేనన్నం గొంతమంది కనిష్టము నసహ్యము నని నాకుఁ దెలియును. అట్టిదాని మీరు మీమనస్సులనుండి పాఱఁదోల వలెను. ఉన్నవిషయముల ననుసరించి మీరు తీర్పు చెప్పవలెను. ఇందులో నేను స్వయముగా వాదించుటకు ముఖ్యకారణము తిల కన్నఁగా నెట్టిస్వభావముగలవాఁడో మీకుఁ దెలియుట కేసుఁడీ! నాసంగతి మీ కిపుడువిపులముగా విస్పష్టముగాఁ జెప్పి యుంటిని. అం దేమైన దోషమున్న దని తోచిన నే నపరాధి నని మీరు చెప్పవచ్చును. కాని మీ రిందు నాకువ్యతిరేకముగాఁ జెప్ప రని దృఢ మైననమ్మకము కలదు. అంతయుఁ గడుజాగ్రత్తతో నాలోచించినపిమ్మట నేను నిరపరాధి నని మీరు చెప్పఁ గలరు. నా కిందు సందేహ మేమియును లేదు. నాస్వవిషయమై మిమ్ముఁ బ్రార్థించున దేమియును లేదు. గాని దేశక్షేమాభివృద్ధిం గోరి ప్రజాపక్షమున నున్నవాఁడనై యింతదూరము చెప్పవలసివచ్చినది. దేశవిషయము భగవద్విషయమువంటి దని మీ రెఱుంగుదురుగాక:—

ఉ. ఎవ్వనిముందు నిల్చి మన రెల్లర మొక్కుదినంబునందు మే
మివ్వి యొనర్చినార మని యేర్పడఁ జెప్పఁగ నొప్పి యుండుమో
యెవ్వఁడు సర్వసాక్షి యగు నీశ్వరుఁడో యతఁ డిప్డు ధైర్యముం
నివ్వటిలంగఁ జేసి మిము నిల్పును గావుత ధర్మసంగతిన్. 3

బ్రౌ సన్—(గవర్నమెంటుప్లీడరు) మహనీయులారా! ఈబాల గంగాధరతిలకునకు న్యాయశాస్త్ర మంతచక్కఁ గాఁ దెలియదు. తెలియక చర్విత చర్వణముగాఁ జెప్పినదే పదిసార్లు చెప్పుచుఁ గాలక్షేపము చేసినాఁడు. అందు నిరవసరము లైనసంగతులు పెక్కులున్నవి. అవి రాజకీయవిషయములం దసందర్భములు. తిలకు వ్రాసిన

వ్రాఁతలు రాజద్రోహశాసనముక్రింద వచ్చునా రావా యను విషయ మొక్కటియే యాలోచింపవలసియున్నది. రాజద్రోహవిషయమై యింతకుమున్ను చెప్పినతీర్పులు విచారించినచోఁ దిలకువ్రాఁతలు పరిపూర్తిగా రాజద్రోహకము లని విస్పష్ట మగుచున్నది. బాంబుప్రయోగ మీతఁడు శ్లాఘించినాఁడు. తిలకునడవడెని గోర్టువా రంగీకరించినచో నరాజకము తప్పక ప్రబలు ననుటకు సందేహము లేదు. ఈవ్యాసము లన్నియుం జదివినవారికి హిందూదేశప్రభుత్వ మన్యాయముగ నున్న దన్నమిషచేఁ బ్రిభుత్వముపై నిరసనభావమును, గ్రోధమునుఁ గల్గుఁగఁ జేయునుద్దేశము కనబడుచున్నది. ఈతిల కిదివఱకు నొకసారి పదిసంవత్సరములక్రిందట రాజద్రోహపునేరముం జేసి పదునెనిమిదిమాసములు శిక్షింపఁ బడి యున్నాఁడు. కాఁబట్టి మీ రీతనిం గూర్చి తగిన ట్లాలోచించి మీయభిప్రాయ మొసంగ వలయు నని కోరుచున్నాను. (అని కూరుచుండును.)

దేవారు—(పంచాయతీదార్లంగని) మీ రుభయపక్షవాదములును విని యున్నారు. ముద్దాయి చెప్పిన ప్రతివిషయమును మీరు జాగ్రత్తగా నాలోచించి యతనినేరముం గూర్చి మీకు సందేహము గలిగినయెడల నట్లు చెప్పవచ్చును. ముద్దాయి నిర్దోషి యని తోఁచినయెడల నట్లు చెప్పవచ్చును. ముద్దాయి చట్టమునతిక్రమించి ప్రభుత్వముమీఁద నహంకారము నిరసనభావమును గలుగఁ జేయునట్లు వ్రాసె నని వ్యాసములవలనఁ దోచినయెడల దోషి యని యట్లు చెప్పవచ్చును. కాని, మీ రందఱు నేకాభిప్రాయమునకు రానియెడల నెవరి యభిప్రాయమును వారు చెప్పవచ్చును. మీ రీన్యాయస్థానమున జరిగినవిషయములు మాత్ర మేమరక సరిగ నాలోచించియు, నతనివ్యాసములు మీరు జాగ్రత్తగాఁ జదివియు నితరవిషయములను మనస్సునం దుంచుకొనక ప్రవర్తింపవలెను. వీలుపడినయెడల నేకగ్రీవముగా

మీతీర్మాన ముండుట శ్రేయము. మీరాయిచ్చినతీర్పు ననుసరించి నేను న్యాయము చేయవలసియుండును. కాని యీనేరము చాలఘోర మైన దనియు ముఖ్యమైనదనియుఁ జెప్పుచున్నాను. మీ రాలోచించు కొనుఁడు. (అని విశ్రమించును)

పంచాయతీదార్లు—(లోపలికిఁ బోయి మరల వచ్చి కూర్చుందురు)

దేవారు—మీ రందఱు నేకగ్రీవ మైనయభిప్రాయము గలిగి యున్నారా ?

మొదటిపంచా—లేదు. మాలో నేద్వురీమూఁడు కేసులలో ముద్దాయీ దోషి యనియుఁ దక్కినయిర్వురు నిర్దోషియనియు నభిప్రాయపడి యున్నారు.

దేవారు—మీ రందఱు నేకాభిప్రాయమునకు రా నేమాత్ర మైన వీలు గలదా ?

మొదటిపం—ఎంతమాత్రమును వీలు లేదని చెప్పుటకు విచారించుచున్నాను.

దేవారు—(తిలకుదిక్కు మొగంబై) నేను శిక్ష విధింపకమున్ను నీ వేమైన చెప్పఁగోరెదవా ?

తిల—(ధైర్యముతో)

ఉత్సాహ. చెప్ప దలఁచి యున్న దెల్లఁ జెప్పి యుంటి నిప్పుడీ
చొప్పునన్ మెలంగి వీరు చొప్పు దప్పి చెప్పినన్
జెప్పనిమ్ము దైవ మిట్లు చెప్ప దేను మాత్ర మే
తప్పు లేనివాఁడ ననుచుఁ దవిలి తవిలి చెప్పెదన్. ౪

మఱియు నీభూచక్రంబునం గలసమస్తవ్యక్తులను నడపింపఁ గలుగునట్టిమహాశక్తులు కొన్ని గలవు. అవి వేని నెట్లు త్రిప్ప వలయు నన్న వాని నట్లు త్రిప్పఁ గలవు. ఈసర్వమును విచారింపఁగా ;—

శా. స్వేచ్ఛావృత్తిని సంచరించుచును నే నిట్లుంట కన్నన్ సమ
స్తేచ్ఛాసంగతులం ద్యజించి చెఱయం దేదే బాధలన్ బొందుటన్
స్వచ్ఛుండై తగునాదనుద్యమము పెం పందంగ నై యుండు నం
చిచ్ఛాశక్తి దలంచి యుండు నని లో నిప్పట్ల నూహించెదన్. ౫

తే. నేను జెఱసాల నుంటినే యేని నాదు
ప్రజలు ప్రజ్ఞాధురీణులై పాటుపడుచు
మాతృదేశము నుద్ధరింపంగ నెంత్రు
కాన భగవంతుఁ డీరీతిగాఁ దలంచె. ౬

ఇదియును నాలాభమునకే వచ్చినది. కాని నష్టమునకు రాలేదని ముమ్మాటికిం జెప్పుచున్నాను.

దేవారు—తిలకా! నీకు నే నిపుడు శిక్ష విధించుట నిశ్చయము. ఇట్టిస్థితిలో నిన్నుఁ జూచుటవలన నాకెంతవిచారము గలుగుచున్నదో నేను జెప్పఁ జాలను. నీవు గొప్పమేధాశక్తియు, గొప్పసామర్థ్యంబును, గొప్పవశీకరణశక్తియును గలవాఁడవు. నీ తెలివి తేటలు దేశక్షేమము నకై నుపయోగించినయెడలఁ బ్రజలసౌఖ్యము నభివృద్ధి చేయుటకుఁ గారణమై యుండునుగదా! పదిసంవత్సరములకిందట నీవు నేరముచేసి దోషివై న్యాయమూర్తికరుణాతిరేకంబున సైకముగా శిక్షం బొంది సార్వభౌమురాలియనుగ్రహంబునకుఁ బాత్రుండవై విముక్తుండవైతివి. నీవిపుడు వ్రాసినవ్యాసములు రాజకీయాందోళనమునందు సరియైనమార్గము లగు నని చెప్పువాఁడు పిచ్చివాఁడు గాని మూర్ఖుఁడు గాని యై యుండవలయును. అవి రాజద్రోహముతో నిండినిబిడీకృతంబులై యున్నయవి. ఘోరకృత్యములను బోధించుచున్నయవి. నరహత్య నామోదించుచున్నయవి. నీచకార్యమైన బాంబుప్రయోగమునీకంగీకారమే కాక నీవు బాంబులుహిందూదేశములోగాలుపెట్టుటకు సంతసించుచుం బిలుచుకొని వచ్చినవాఁడవైతివి. నీమాతృదేశమునకది యేమో మేలు చేయు

నని నీవు తలంచుచున్నావు. నీవ్యాసములు సరి యైన వని తలంచువాఁ డుండునని తలంపను. ఇన్ని సంవత్సరములు వచ్చినను ప్రభువులందు నీకు ద్వేషబుద్ధి పోయినది కాదు. ఈవ్యాసములు నీవు ప్రతివారము నాలోచించి నిర్దోషిణు లైనయిద్దఱాంగ్లేయస్త్రీలు చంపఁబడినవెనుక పది యైదుదినములకు బుద్ధిపూర్వకముగా వ్రాసినవి గాని వేడిమీఁద తొందరపడి వ్రాసినవి కావు. నీవు దోషి వని నిర్ణయింపఁ బడినయెడల నీకెట్టిశిక్ష విధింపవలయునో యని నేను మహాందోళనముతో నాలోచించితిని. ఇప్పుడు నామనస్సులో స్థిరపఱచుకొన్నశిక్ష తేలికగా నున్నదని నన్ను నలువురు నాలుగుమాట లనక మానరు. నీవు చేసిననేరమునకు నావిధి ననుసరించి నీకు విధించుశిక్షకన్నఁ దక్కువశిక్ష వేయుటకు నాకు వీలు గలుగ లేదు. నీవంటిస్థితిగతులలో నుండుమనుష్యునకు నీశిక్ష న్యాయశాస్త్రము ననుసరించి యున్న దని నేఁ దలంచెదను. ఈనేరమునకు యావజ్జీవద్వీపాంతరవాసశిక్షవిధింప వచ్చును. కానీ నీకు ద్వీపాంతరవాసమా ? కారాగారమా ? యనియాలోచించితిని. నీవయస్సును బట్టియు నీయితరవిషయములం బట్టియు నాలోచించి దేశములో శాంతి నెలకొల్పనెంచి నేను ప్రేమించుచుంటి నని నీవు నటించునీదేశమునకు నవలగాఁ గొంతకాల ముండుట క్షేమకరమని నేను దలంచితిని. 124 యే. చట్టముప్రకారము యావజ్జీవముగాని యంతకుఁ దక్కువకాలముగాని నీకు ద్వీపాంతరవాసశిక్ష విధించుటకు నా కధికార మున్నది. కావున నీ కాఱుసంవత్సరములు ద్వీపాంతరవాసశిక్షయు వేయిరూపాయలు జరిమానాయును విధించుచున్నాను (అని తత్క్షణము లేచి పోవును)

రక్షకభటులు—(తిలకుహస్తద్వయంబునకు సంకెలలు వేయుదురు)

తిల—(చేతు లెత్తి మొక్కుచు)

చ. నిరతము లోకసౌఖ్యమును నెమ్మది నెంచుచు నుందునేని నేఁ
బరులకు హాని సేయుటకు భావము సేయనివాఁడ నేని నీ
చరణము నమ్మి నీభజన సల్పుచు నుంటినయేని యోపరా
త్పర! కరుణింపవే భరత వర్షము భవ్యగతిం దలిర్పఁగన్. 2

రక్షకభటులు—(అంతలోఁ దిలకుని లాగుకొని పోవుచున్నారు)

ప్రజలు—(వేలకొలఁది కలకలము హెచ్చఁ గోర్టులోఁ బ్రవేశింతురు)

రక్షకభటులు—చలో చలో జావ్ జావ్ (అని కేకలు వేయుచున్నారు)

సిపాయీలు—(ప్రవేశించి వెడలఁగొట్టుచున్నారు)

కొందఱు—(నేలఁ గూలుచున్నారు.)

జనులు—(చెల్లాచెద రగుచున్నారు. తెర పడుచున్నది.)

ఇది సప్తమాంకము.

శ్రీరస్తు.

# తిలకమహారాజనాటకము.

## అష్టమాంకము.

స్థలము పూనాలోఁ దిలకభవనము.

(కపర్దియుఁ గేల్కారును బ్రవేశించుచున్నారు.)

కపర్ది—

చ. అనుజునికన్న నన్నుఁ గడు నర్మిలిఁ జూచుచు నాకుటుంబమున్
జనదుకుటుంబమట్లరసి నా కెపుడున్ భుజ మట్లులై జగ
జ్జనసుతుఁ డైనవాఁడు తన జన్మము నెప్పుడు జన్మభూమికై
తనరఁగఁ జేయునట్టిగుణధామున కిట్లగచాట్లు చెల్లునే. ౧

కేల్కార్—క. ఘనకార్య మొనరఁ జేయం
జనుజనునకు నిట్లు గాక సౌఖ్యం బగునే
మనతిలకార్యున కిది నూ
తనమే? యెద్దానికైన దైవము లేదే. ౨

కపర్ది—కేల్కార్! దేవారు పట్టుపట్టి శిక్షించినాఁడు సుమీ!

కేల్కార్—అవును. ఇట్లు చేయవలె నని చేసినదియే. నేఁడుగా కున్నతన్యాయస్థాన మెప్పుడైన రాత్రి పదిగంటలవఱకుం బని చేసినదా?

కపర్ది—అధికారులు నోరుగల్లవారిని లేవనీరు గదా! కేల్కార్! దేవా రిట్లు మాఱిపోయినాఁ డేమి?

కేల్కార్—అది యుద్యోగలక్షణము. ఊడిగము సేయఁ గుదిరినవారిబ్రతు కిట్లే యుండును :—

ఉ. వారుస్వలాభ మారయుచు బానిసవృత్తికిఁ జొచ్చి నిచ్చలున్
గౌరవభంగ మైనఁ దమ గాదిలిదేశము దేశసోదరుల్

ఘోరవిపత్పరంపరలఁ గూలిన నెంచక కించులై యమ
క్రూరగదాహతిం బడఁగఁ గోరి మెలంగుచు నుందు రక్కటా. 3

కపర్ది—దేవారు శిక్షించినంతనే యంత గంద్రగోళ మైనదేమి?

కేల్కార్—లోకమాన్యునిపై నభిమానంబుగలప్రజలెల్లరును విచ్చుకత్తులవారు మొత్తుచున్న నెత్తిగిలక చుట్టుముట్టి యుండి తిలకుం బట్టి రనునంతలో నెక్కపెట్ట లోనికి వచ్చిపడిరి. అంతలో సిపాయీలు వచ్చి వారిపై నేకఘ్నులు ప్రయోగించిరి. కొందఱు మ్రందిరి. కొందఱు వికలాంగులైరి. కొందఱు చిందువందైరి. క్రమముగా నవ్వార్త పుర మంతయు నంటుకొనినది. లోకబాంధవుఁడైనతిలకునిబంధించుటకా బొంబాయిపౌరు లెల్లరును డిల్లపడియును, దల్లడిల్లియును, నేలంద్రెళ్లి యును, బెల్లుమూర్ఛిల్లియును గొల్లు మని రోదనంబు చేసియును, నల్ల రులకుం దిగియును నల్లకల్లోలంబు గావించిరి. వర్తకు లంగడులెల్ల మూసిరి.లక్షలకొలంది పాటకప్రజనులు తమతమపనులం బరిత్యజించిరి. ఇట్లు పురం బంతయు నారుసంవత్సరములశిక్షకుఁ జాలున ట్లాఱుదినం బులు సమ్మె కట్టి బెట్టువగచియున్నారు.

కపర్ది—రక్షకభటులు తిలకు నెటకుఁ గొనిపోయిరో ?

కేల్కార్—ఆరాత్రి యెవరికంటంబడకుండ సముద్రమధ్యమం దొకనావలోఁ బెట్టి మరునాఁడమహదాబాదుజైలునకుం గొనిపోయి యటనుండి మాండలీకోటలోనిచెఱసాలకుం బుచ్చిరని వినియున్నాను.

(తెరలో శబ్దను ఆకర్ణించి)పుత్రికాసమేతయై లోకమాతయగు సత్యభామాబాయి యిట్లే వచ్చుచున్నది. వచ్చిన నెట్లు పరిసంగింప వచ్చునో ? (అంత సత్యభామాబాయి ప్రవేశించుచున్నది)

ఇద్దఱు—(లేచి నమస్కరించుచున్నారు.)

సత్య—(ఆశీర్వదించుచున్నది.)

అందఱు—(ఆసీను లగుచున్నారు.)

సత్య—అన్నలారా! మీరు ముమ్మాపురమ్మునుండి వచ్చి యుందురు. మనమహారాజుపై వచ్చినయభియోగ మే మైనది?

క. న్యాయాన్యాయవిచారము
చేయఁగ తుది నెంతు రేని సిద్ధము మనకుం
శ్రేయ మగు నట్టు లెన్నఁడు
జేయరు వా రదుగ నేల? చెప్పఁగ నేలా. ౪

కేల్కార్—అమ్మా! సర్వజ్ఞురాలికిం జెప్ప నేల? అయినం జెప్పెద నాకర్ణింపుము.

మ. అభియోగం బిది యిట్టివారి తవలనం బ్రాప్తించె నంచొక్కఁడున్
ప్రభుపక్షంబున సాక్ష్య మీఁదు పరివర్తం బొప్పి లే దంచుఁ ద
త్ప్రభువుల్ సెప్పిరి హూణు లేద్వరచటం బంచాయతీదార్లు త
త్ప్రభృతుల్ నేరముమోపిరందుపయి దేవా రజ్ఞుఁ డయ్యెం జుమీ.

తే. అకట యే మందు నోతల్లి యాంఱునక్స
రములు తిలకుండు మాతృదేశమును విడిచి
మాండలీకోటలోఁ జెఱ నుండు నట్లు
శిక్ష విధియించి పంచె నా చెనఁటి ప్రభువు. ౫

సత్య—(ఇంచుక మూర్ఛిల్లి తెలిసి)

మ. అకటా! యే మని చెప్పుదాన జగదేకారాధ్యుఁ డై నట్టిమా
మకనాథుం డొకచక్రవర్తి యయి సన్మానార్హుఁ డై యొప్పియుం
టకు నోవాఁడు సుఖంబు నానెఱుఁగ కుండం మాండలీకోటలోఁ
గ్రికచాగారమునందు నుండఁ గలఁడై గాసింబడం గల్గెనే. ౬

తరళము. అతఁడు పుట్టినదాదికష్టము లందెఁ గాని సుఖంబునా
మతి నెఱుంగఁడు దేశసేవకు మానముం మఱి ప్రాణముం

ధృతిఁ దలంచుచు దార వోసిన ధీరుఁ డాభగవానునిన్
వితగ బాధలఁ బెట్టుచుండిరి వీర లెప్పటి కప్పుడే. ౮

కపర్ది—క. తల్లీ! చింతింపకు మే
నెల్లియ లండన్పురమున కేగి యి దెల్లన్
దెల్లముగఁ జేసి దొరలకు
నెల్లవిధంబులను దెత్తు నిదె నీభర్తన్. ౯

నీ విట్లు పరిదేవనంబు సేయకుము దేశసేవాపరు లెట్టియిక్కట్టుల నైనం బాలుపడ వలసి వచ్చును గదా!

సత్య—(ధైర్యముతో) నాప్రాణవల్లభున కెల్లప్పుడును సుఖము లేక పోయెం గదా యని యె ట్లనుకొంటిని గాని పరిదేవనంబు సేయుచుంటినా?

క. ధైర్యహిమాద్రి యనం దగు
శౌర్యోజ్వలమూర్తి కేను సహధర్మిణి నై
ధైర్యము చెడఁ బరిదేవన
మార్యా! పొనరించుదాననా? తలపోయన్. ౧౦

కపర్ది—నాపడిన ప్రమాదంబునకు సైపఁ బ్రార్థించుచున్నవాఁడ. వినుము:—

తే. లోకమాన్యుని మైగాలి సోఁకినట్టి
యెట్టివారికి ధైర్యంబు పుట్టు ననిన
నీవు సహధర్మచారిణి వెట్లు నీకు
మనమునన్ బేలతన మబ్బునో మాత! చెప్పుము. ౧౧

సత్య—ఆర్యా! వినుము

చ. మనమున దేశభక్తి గల మానిసి యై తనజీవితంబు త
జ్జనులకు నప్పనంబనుచు సంతతసేవ యొనర్చుధార్మికుం

డనిశము నట్టి కార్యముల । యందు మెలంగక యుండనిట్లువ
చ్చెనెయని చింత కాని పెర । చింత యొకింతయు లేదు నామదిన్.

కేల్కార్ — తే. ధరఁ బరోపకారార్థ మి । దం శరీర
మనెడునార్యోక్తి యెఱిఁగిన । ఘనుఁ డతండు
బందెఁ బడియున్న నెందున్నఁ । బ్రదికినంత
కాలమును నిల్చును బరోప । కారమంద. ౧౩

సత్య — అన్నలారా!

ఆ. నామనోహరుండు । నాజీవితేశుండు
బందె నున్నఁ గాసి । డిందువడఁడు
వానిలోనియాత్మ । వచ్చి నిచ్చలు దేశ
సేవఁ జేయుచుండుఁ । జేవ మెఱసి. ౧౪

తే. తనదుజీవిత మంతయు । ననుదినంబు
దేశసేవ కొసంగిన । ధీవరేణ్యుఁ
డార్యజనగణ్యునకు నేను । భార్య నగుట
పూర్వపుణ్యఫలం బని । పొంగుచుంటి. ౧౫

మఱియు నాకర్ణింపుఁడు. ఎట్టిసంకటసమయంబులందును ధైర్యంబు సెడ నీయక దేశసేవాపరుం డయినపతికి హితంబు గాఁ దోడ్పడం గలుగుసతియే సతి కాని కొంద మన్న నమ్ముద మనునది సతి కాదు. ఇప్పు డీదేశంబునం గలసతిపతులెల్లరుం గూడి రాజకీయాందోళనంబు సేయఁ గలిగిరేని దాస్యంబునుండి విముక్తులై స్వారాజ్యంబు వోని స్వరాజ్యంబు నొంది సంతతసుఖంబునం బొందఁ గలుగుదు రనుటకు సంశయంబు లేదు. కానిందు కాలం బెట్లుండునో చూచుచుండుఁడు. నే నిదె భవానీపూజాసమయం బగుదెంచుచున్నయది. గావునం బోయి వచ్చెద ననుజ్ఞ యొసంగుఁడు. (నిష్క్రమించుచున్నది.)

కపర్ది—మనకునుం జాలినంతపని యున్నది కావునంబోవుదము రమ్ము. (లేచి నడచుచున్నారు.) అపటీక్షేపంబున బ్రిహ్మాదేశంబునం దలిమాండలీకోటలోని కారాగారమునకుంబోవుమార్గ మగపడుచున్నది.

కేల్కార్—(తిలకుం దలంచుకొని) హా! హా! మహారాజ!

సీ. కాలుసేతులు చాల ✱ ద్రిప్పిపోం జేసెను,
సంకెలలా నీకు ✱ సదమలాత్మ!
లొమ్ము బద్దలుచేసి ✱ దిమ్మం దిఱుగం జేయు,
మెడబిళ్లలా ? నీకు ✱ మృదులహృదయ !
కటుకుటంపకు లట్లు ✱ చుఱు- కెక్క- ఱాపాడు,
పుటిగుడ్డలా ? నీకుం ✱ బుణ్యమూర్తి !
వంగినం గూర్చున్న ✱ నంగముల్ చిటికించు,
లాటీలయా ? నీకు ✱ లలితచరిత !
తే. విధివిరామము లేక యె ✱ వ్వేళ గొదల
నీన నూడిగమా ? నీకు ✱ మానవేంద్ర !
చూడం గడునేవ గలిగించు ✱ చోడిపిండి
యంబలా ? నీకుం బృథివీసు ✱ రాగ్రగణ్యా ! ౧౬

(అంతలోం జెఱసాలయు, నందు మలినవస్త్రధారి యగుతిలకుం డును నిసుపకట్టలలో నుండి కనుపించుచున్నాండు)

ఇద్దఱు—(చూచి దుఃఖించుచున్నారు)

కపర్ది—క. శూరుండవుగా ధీరుండవుగా
వీరుండవుగా సర్వలోక ✱ విఖ్యాతమహో
దారుండవుగా వారిధిగం
భీరుండవుగా నీకు నిట్లు ✱ వెలసెనె తండ్రీ ! ౧౭

తిల—(లోపలినుండి) మిత్రులారా ! రండు. చింతింపకుండు.

మ. చెరసాలల్ సురసాలమందిరము లిఁకే చేగాళ్ల కౌసంకెలల్
వరనిష్ఠం గొనుయోగబంధములు సంపత్త్యాగముల్ సర్వసం
గరతి స్వీకుటలిందు నూఁడిగము లే ద్క్ష్ఁ జేయునారాధనం
బరుదారం గొనుచోఁడియంబ లమృతం బాఁజువ్వెమాంబోట్లకుఁ.

విద్వాంసు లైనమీ రి ట్లెఱింగి సన్నుతార్పవలయును గాని మీరే యిట్లు చింతించుట మేర గాదు వినుండు :—

క. కలిమియు లేమియు సుఖముల్
బలుదుఃఖము గలుగుచుండుఁ బ్రాక్తనకర్మం
బులకలిమి దాన నుబ్బరు
వలవంతం బొందఁ బోరు పండితవర్యుల్. ౧౯

ఇదినాకు సంతోషకాలము గాని దుఃఖకాలము కాదు. నాయీకారాగారాధివాసమువలన నామాతృదేశము మఱింత పట్టుదలఁ గలిగి పని చేయుచుండును గాని బెండువోయి యుండదు. దానం జేసి నాయుద్యమంబు సఫలం బగు ననియే నానమ్మకము :—

తే. ధరణి నుత్సాహమును బట్టు దలయుఁ గలుగఁ
బ్రజకు నెకశక్తి యుదయించి వఱలుచుండు
దానఁ బరతంత్రు లైన స్వతంత్రుఁ డగుచు
జనుఁడు భాగ్యోదయంబునఁ దనరుచుండు. ౨౦

మఱియు నోమిత్రులారా! నా కీకారాగారము పరమోత్తమ గ్రంథరచనకు సహకారియై పరమోపకార మొనర్చినది గాని కష్టము లకుం గా లేదు. కావున నాకై మీరు చింతింపకుఁడు. మీక్షేమాది కం బెట్టులున్నదియో ? మనదేశం బెట్టులున్నదియో ? యేమి జరుగుచున్నదియో? తెలియఁ జెప్పుఁడు.

ఇద్దఱు:—(దుఃఖించుచున్నారు)

తిలకు—(దీనవదనుం డై) ఏమి యిట్లు దుఃఖించుచున్నారు? మన దేశంబున జాతీయవాద మంతరించి పోయెనా యేమి?

క. పట్టినపట్టుఁ విడువక
దిట్టతనంబునను బ్రజలు । దేశమునందుఁ
మట్టుపడి యున్నఁ గోర్కులు
నెట్టన నెఱవేఱు ననుచు । నేఁ దలఁతు నయో. ౨౧

కపర్ది—(దుఃఖం బడంచుకొని) నీకు శిక్ష విధించిన వెనుక నేను సీమాంతరంబునకుం బోయి పార్లమెంటులో నీయభియోగం బెల్ల విమర్శింపించి వచ్చితిని.

తిల—అయ్యో! యెంతశ్రమపడితివి! అది యే మైనది? ఏ మైనదో నాకుఁ దెలియును గాని నీవే చెప్పుము.

కపర్ది—అట్లే జరిగినది. దాని కేమిగాని—(కంట నీరు పెట్టుకొనుచున్నాఁడు)

తిల—తెలిసియున్న విషయమున కింతచింత యేమిటికి?

కేల్కార్—(కన్ను లొత్తుకొనుచు)

ఉ. చెప్పఁగ నోరు రా దొకలు । చెప్పెద నాగురువర్యుతోడ నేఁ
జెప్పక యూరకుందు నన । జెడ్డతనం బగు దెంచుఁ గావునన్
జెప్పెద గుండెఱాయిగను । జేసికొనం గలయట్టివాఁడ నై
యిప్పుడు లోకమాన్యసతి । యేఁగె దివంబున కంచు నక్కటా.

తిల—(ఇంచుక విచారించుచు)

ఆ. మేనినీడవోలె । మెలఁగుచు నాతోడ
నెల్లపనులయందు । నేక మగుచు
నాకుఁ గాఁగ నైన । నలినాక్షి ననుఁ బాసి
స్వర్గధామమునకుఁ । జనియె నకట. ౨౩

ఉ. పుట్టినవారిలోన మును । మున్న వచింపఁగ నై మహోన్నతిం
బట్టపరీక్షఁ దేఱినకు । మారుఁడు వోయినఁ గూడ, కెప్పు నా
కెట్టిస్వదేశకార్యముల । కేని సహాయము చేయుచుండునా
పట్టప్రదేవి తా నొడలు । వాయుట కెంత విచార మయ్యెడిన్. ౨౮

(అంతలో ధైర్యముం దెచ్చుకొని) అక్కటకటా! గీతారహస్యగ్రంథకర్త నగునే నిట్లు మూఢప్రజ్ఞుండ నై కుందువానిచందంబున నైతి. ఇది నాజన్మంబున కపూర్వంబు సుఁడీ!

కపర్ది—అర్ధాంగివిషయ మిట్లుండుట సర్వసామాన్యముగదా! సర్వజ్ఞుండ వైననీవును నీయర్ధాంగియు నట్లు కారు. మీయిరువుర ధైర్యమును మిహికాహార్యముకన్న మిన్న. హాహా! సతీపతు లన్న మీరును బార్వతీపరమేశ్వరులును గదా! గీతారహస్యగ్రంథకర్త నంటివి. అట్లయిన నీవు శ్రీకృష్ణభగవానుఁడవును నీదేవి సత్యభామయునా?

తిలకు—(గ్రంథముం జూపి) ఇదిగో గీతారహస్యగ్రంథము దీని నిం దుండి యే వ్రాసితిని.

కపర్ది—దీనివిశేష మేమి? గీత లన భగవద్గీతలే కదా?

తిల—అవును. వానిలోనిరహస్య మిట్టిదని వెల్లడించునీగ్రంథమునకు గీతారహస్య మని పేరు.

కపర్ది—ఆరహస్య మెట్టిది?

తిల—చెప్పెద వినుము. నాకుఁ బదియాఱుసంవత్సరముల యీడు వచ్చినప్పుడు మాతండ్రిగా రంతిమావస్థయం దుండి భగవద్గీతలు చదివి తమకు వినిపింపు మని నా కాజ్ఞ యిచ్చిరి. అప్పుడు నేను వారు చెప్పినచొప్పునం జేసితిని. దానం జేసి నాకు గీతాశాస్త్రమందుఁ బరిచయము కలిగినది. కాని దాని భావార్థములు పరిపూర్ణముగాఁ దెలిసికొనుశక్తి లేక పోయినది. గీతలయందు మతసంబంధ మైనట్టియు వేదాంతసంబంధ మైనట్టియు మహావిషయ మున్న దనియు దానిఁ

దెలిసి కొనుటకుఁ బ్రపంచసంబంధము వదలుకోవలె ననియుఁ బెద్ద లు చెప్పుచుండు మాటలు చిన్ననాఁటనే విని యున్నాఁడను. ప్రపంచ సంబంధము వదలుకొన్నఁ గాని భగవద్గీతలు తెలియవా యని సందేహము మాత్రము నాకుఁ గలిగి యున్నది. పిదప సంస్కృతభాషయు నింగ్లీషుభాషయు నభ్యసించి గీతలపై నున్న సంస్కృతభాష్యములును ఇంగ్లీషునందును మహారాష్ట్రమునందును గలవివేచనములును జదివి నాఁడను. త్రిమతస్థులును వారివారిమతానుసారముగా సిద్ధాంతీకరించి వ్యాఖ్యానములు చేసిరి. ఈసిద్ధాంతము లేవియు మనస్సునం బెట్టుకొనక గీత లేసందర్భమునఁ జెప్పఁబడినవో యనునంశము మాత్రము మఱవక చదివినయెడలఁ గర్మయోగమే యందుఁ బ్రబలమై యుండినట్లు తోఁపక మానదు. అర్జునుఁ డనిలో నాత్మీయులఁ జంపుటకు సంశయించునప్డు వానిజంకు వాపుటకు శ్రీకృష్ణుఁడీభగవద్గీతల నుపదేశించి యున్నాఁడు. దీనిలో భగవంతునియుద్దేశ మిది యొక్కటియే కాని మఱియొకటి కాదు. ఇందు భక్తిజ్ఞానయోగములు కర్మయోగమున కంగములై యున్నయవి. భక్తిజ్ఞానములు కలవాఁడు సైతము ప్రపంచముతో సంబంధము గలిగి పని చేయవలెనని స్పష్టపడుచున్నది. కావున నెల్లవారును ఫలాపేక్ష లేక విధి ననుసరించి కర్మము చేయవలయు నిదియే భగవద్గీతలలోనిముఖ్యార్థము. ఇదియే రహస్యము.

కపర్ది—హాహా! నీపాండిత్యప్రభావమఖిలలోకసంస్తవనీయము గదా! లోకమాన్యా! నీగీతారహస్యమువలన శ్రీకృష్ణభగవానుఁడు నీవై పుట్టి గీతార్థమును వెల్లడించె ననుట కింతైన సందియము కలదా?

తిల—మీరు వచ్చి కొన్నిదినంబు లైనది. మనవా రెల్లమీ కై నెదురు సూచుచుందురు. కావున మీరు పోయి నే నిట సుఖంబుంటి

ననియు నింతలోన వచ్చి దేశసేవయందు మీకుఁ దోడ్పడియెద ననియు నెల్లవారికిం దెలియఁ జెప్పుడు. మీరు మాత్రము స్వరాజ్యాది సమస్యల నేమర కుండుఁ డిదియే నా ప్రార్థనంబు.

కేల్కార్—రామచంద్ర శ్రీధరులతో నేమి చెప్పుమని యాజ్ఞ?

తిల—ఉ. తల్లి ఋణంబుఁ దీర్చితిరి ♦ తండ్రి ఋణంబు వీక దీర్చి లోకముం
దెల్లెడ మంచివారనఁగ ♦ నెంతయుఁ బేర్మికి నెక్కి వంశముం
దల్లినిఁ దండ్రినిం దలఁచి ♦ తద్విధముం గొని దేశభక్తులై
చల్లనిచిత్తముం గలిగి ♦ సంతతముం బొలుపొందుచుండుఁడీ. అని
అని చెప్పుము. మఱియు నాబంధుమిత్రవర్గంబుతో:—

మ. నిజదేశంబునయందు భక్తి గలరై ♦ నిచ్చల్ ప్రజాక్షేమముల్
ఋజుమార్గంబునఁ గోరుచుల్ మది లస ♦ ద్దీప్తిన్ స్వరాజ్యంబు నెం
దఱపం జెప్పుడు మాన్యకుండి ధరణిన్ ♦ దాస్యంబు వోఁజేయుచున్
సుజనత్వంబునఁ గాలమ్ముం గడపుఁ డంచుం జెప్పి యొప్పింపుమా.

ఇద్దఱు—మహాత్మా! మా కు న్నాజ్ఞ యొసంగుము. పోయి వచ్చెదము.

తిల—సరే! పోయిరండు. దేశభక్తి నేమరకుండుఁడు.

ఇద్దఱు—చిత్తము. (నిష్క్రమించుచున్నారు.)

తెర పడుచున్నది.

---

ఇది యష్టమాంకము.

శ్రీరస్తు.

# తిలకమహారాజనాటకము.

## నవమాంకము.

స్థలము — పూనాలో నొక అచ్చుసావడి

(రాముఁడు కృష్ణుఁడు నను నిద్దఱు మహారాష్ట్రులు ప్రవేశింతురు.)

రా — షష్టిపూర్త్యుత్సవమంటే సామాన్య మనుకొంటి నబ్బా యెంత తం తున్నది! ఈనాఁడు తిలకు నింట వేదపారాయణము, సూర్యనమస్కారములు, నవగ్రహశాంతులు, రుద్రాభిషేకములు, హోమములు, దానములు, ధర్మములు, బ్రాహ్మణసమారాధనమును మహోన్నతముగా జరిగినవి సుమీ!

కృ — తిలకమహాశయుండు పూర్వాచారపరాయణుండు. ఆతనికిఁ బ్రజానురాగము నత్యధికమే.

రా — అవు నతం డీనడుమ మాండలీకోటనుండి వచ్చినప్పుడు మహారాష్ట్రు లెల్లరును బోయినతండ్రి మరల బ్రతికివచ్చినప్పు డతని బిడ్డ లెట్లు సంతోషింతురో యట్లు సంతోషించిరి.

కృ — అతండీ నడుమ జర్మనీదేశవేదాంతులతోఁ బ్రసంగింపఁ బోవు ననుకొంటిమి. పోలేదేమి?

రా — అయిరోపా మహాసంగ్రామ మంతరాయము గల్గించినది.

కృ — ఆసంగ్రామ మతనికి సంతోషదాయకమా?

రామ — కాదు కాదు. తిలకమహారా జెప్పుడును రాజద్రోహి కాఁడు. తానీసందర్భముం బురస్కరించుకొని మహాసభలు చేసి మనప్రభుత్వమువారికి వారనియిక్కట్టు వచ్చినది. వారికి మీరెల్లరును సాయముచేయ వలయు నని బోధించి ప్రజలం బుఱికొల్పి యున్నాఁడు. రాజద్రోహి యిట్లు చేయునా?

కృ—అతఁడు కార్యవాది గాని ఖడ్గవాది కాఁడు. సూరతులోఁ జీలిపోయిన దేశీయమహాసభను మరల లక్ష్మణపురిలో సమావేశముచేసి మితవాదులను జాతీయవాదులను గలియఁ గూర్చినాఁడు. లక్ష్మణపురియం దగుదేశీయసభ కాతఁడు పోయినప్పు డెల్లరు నాదలం బెట్టుకొని పూజించిరి. ధూమశకటము దిగినతోడనే వేలకొలఁది దేశీయనాయకులు వచ్చి యుత్సవముతోఁ దోడ్కొని పోయిరి.

తే. గీ. సూరతుమహాసభకు నధికారి యయిన
రసవిహారఘోషమ్మహారాజ తిలకుఁ
గ్రుచ్చి కౌఁగిటఁ గదియించి మెచ్చి గౌర
వించె నఁట! లక్ష్మణపురిలో వింటె కృష్ణ! ౧

కృష్ణ—వింటి నతం డీనడుమ స్వరాజ్యసమితి నొకదానిం స్థాపించి మహారాష్ట్రదేశ మంతయుం దిరిగి మహోపన్యాసములు చేసినాఁడు. అతనియందుఁ బ్రజల కెంతవిశ్వాసమో చూడుము. నేఁడు తమభక్తి విశ్వాసములను వెల్లడించుకొనుట కే యీషష్టిపూర్త్యుత్సవమును బ్రకటించినారు సుమీ.

రా—ప్రజల కంతవిశ్వాసమునకుఁ గారణ మేమి?

కృ—అతఁడు దేశాభివృద్ధికై ముప్పదిసంవత్సరములనుండి తన జీవితమును ధారవోసి యున్నాఁడు. అతనిప్రభావము వినుము—

సీ. వేదశాస్త్రంబులవిధ మెల్లఁ దెలియంగఁ,
జదివినవిద్యావిశారదుండు
జ్యౌతిషరూపంబు ఖ్యాతిమై నేర్చి మ,
హాగణకుం డగునట్టి మేటి
పట్టపరీక్షలోఁ బ్రజ్ఞఁ గైకొని న్యాయ,
శాస్త్రవిద్వర్యుఁడై చనినసూరి

లోకవిఖ్యాతమై శివాకొనఁగ మరాటి,
యును గేసరియు నిల్పి శితనరఘునుఁడు

తే. గీ. సుగుణముల ప్రోవు విద్దెల సుద్దితావు
బుద్ధిని బృహస్పతికి సాటి శపుణ్యాచరితుఁ-
డన్నృత మెఱుఁగఁడు సత్ప్రివర్తనము గలఁడు
దేశభక్తాగ్రిసరుఁ డల్ల శధీవరుండు. ౨

రా—నేఁడు తిలకభవన మెంతో సందడిగా నున్నది సుమీ!

కృ—భోజనార్థమువచ్చినబ్రాహ్మణులుగాక ప్రేక్షకులైవచ్చిన వా రెనిమిదివేలు. అందు బెల్వీ, పటవర్ధన్, మార్ మోహన్ దాసు రాంజీ, డాజీయబాజీఖరే, దేశముఖు, దేశాయి, ప్రభృతు లగుప్రిముఖు లనేకులు చేరి యుండిరి.

రామ—నేఁడు సభ యెన్నిగంటలకు సమావేశమగును ?

కృ—సాయంతన మైదుగంటలకు సమావేశమగును.

రా—ఇది మహారాజపట్టాభిషేకముం బోలి యున్నది. మనము కూడ నమ్మహోత్సవముఁ జూడఁ బోవుదము రమ్ము.

ఇద్దఱు—(నిష్క్రమించుచున్నారు.) ఇది విష్కంభము.

---

(అపటీక్షేపంబున సభాస్థలంబునఁ గిక్కిరిసి వేలకొలదిజనులు కనఁబడుచున్నారు.)

(బాలభటులు దండహస్తులై బారులు తీఱి నిలువఁ బడుచున్నారు.)

దేశాయి—మహాశయులార ! నేఁ డీసభకు డాక్టరుపటవర్ధన్ గారగ్రాసనాధిపత్యము వహించుటకుఁ గోరుచున్నాను.

దేశపాండ్యా—నేను దేశాయిగారికోరికనుబలపఱచుచున్నాను.

పటవర్ధన్—(అగ్రాసనాసీనుఁడగుచున్నాఁడు కరతాళధ్వనులగును.)

(అంత బాలభటులు వరుసలుతీరి ముందు వాద్యములతో నడచుచుండఁ గేల్కారును, గపర్దియుఁ జేయూఁత యొసంగఁ జందనపుష్పమాల్యాద్యలంకారాలంకృతుఁడగుతిలకమహారాజు ప్రవేశపెట్టఁబడుచున్నాఁడు.)

అంటఱు——(లేచి జయజయశబ్దములు కరతాళధ్వనులు చేయుచున్నారు.)

పటవర్ధన్——(లేచి చేయూఁత యిచ్చి తోడితెచ్చి తనచెంత నలంకరింపఁ బడిన యున్నతాసనంబునఁ దిలకుం గూరుచుండఁబెట్టుచున్నాఁడు)

అందఱు——(ఆసీను లగుచున్నారు.)

పటవర్ధన్——సభాసదులారా! నేఁడు లోకమాన్యుని షష్టిపూర్త్యుత్సవమునకై మన మిటఁ గలిసికొంటిమి. ఈదినము హిందూదేశమునకంతకును బర్వదినము. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని చెప్పినట్లు ధర్మవిప్లవ మయినపుడు భగవానుఁ డీభారతమున నవతరించు నని మన మెఱుంగుదుముగదా! ఇప్పుడు మన దేశము మిక్కిలి దీనదశయందున్నది. తన్నివారణార్థము మనతిలకమహాశయుండు భగవదంశసంభూతుఁడై పుట్టియున్నాఁ డనుట నిర్వివాదాంశము.ఇది మనయదృష్టము. మనభాగ్యము. మనపుణ్యము.ఈవిషయమై మనహిందూదేశస్థులందఱును గర్వపడవలసినవారై యున్నారు.ఈలోకమాన్యుఁడు వేదవేదాంగవేత్త. వేదాంతవిజ్ఞుఁడు. ఇతనివాఙ్మయము ప్రజలమనముల నాటుకొనునట్లుండును. ఈతనిభూతదయ చెప్పశక్యము కాదు. మహారాష్ట్రభాషలో నింతప్రామాణికుఁ డెవ్వఁడుం గానరాఁడు. ఇతఁడు భగవదంశము గలవాఁడుగనుకనే ప్రజల నాకర్షించుశక్తి గలవాఁడై యున్నాఁడు. ఇట్టిమహామహుఁడు పుట్టుటం జేసి రాజ్యాంగవిషయమున నవీనోద్యమము పుట్టి పెరుగుచున్నది.స్వార్థత్యాగి యగునీతని యందు దేశాభిమానము మూర్తీభవించి యున్నది. ఇట్టిమహాప్రభువు

నకు షష్టిపూర్త్యుత్సవము చేయుట మనకకా దీలోకమున కెల్ల సంతోషకరము మన మీలోకమాన్యునియెడఁ గృతజ్ఞులమై యుండుట మనకృత్యములలో మొదటికృత్యము.

మ. భగవంతుండును లోకమాన్యుఁ డనఁనై ప్రఖ్యాతినిం గాంచి యీ
జగతిన్ ధర్మపరాయణుం డయినప్రాజ్ఞావంతుఁ డీతండు మెం
డగుసౌఖ్యంబున మాతృదేశ మెసఁగన్ బ్రారంభముం జేయుచున్
దగి పెక్కేండ్లు మనంగఁ జేయుట కెదన్ బ్రార్థింతుసర్వేశ్వరున్.

కేల్కార్—(లేచి) ఓహో ధన్యులార! లోకమాన్యులకు షష్టిపూర్త్యుత్సవము గావించుట కీనడుమ కొన్నిదినములక్రిందటనే కొందఱు మిత్రు లాలోచించి యిట్లు నిశ్చయించిరి. ఈస్వల్పకాలములో నిప్పటికి కొకలక్షరూప్యములు సమకూడినవి. వ్యవధి యున్నచో మఱికొన్నిలక్షలు సమకూడి యుండును. ఇవి గాక. దివ్యభూషణంబులు, దివ్యాంబరంబులు, దివ్యరత్నాంగుళీయకంబులును గొన్ని చేకూరినవి. ఇదిప్రజానాయకుం డైనతిలకమహాశయునియందుఁ, బ్రజలకుఁ గలభక్తివిశ్వాసముల నెల్లడించుచున్నది.(కొన్ని యినుపపెట్టెలు తెప్పించి చూపి) ఇది గాదు. దీనిమించినద్రవ్య మైన మనలోకమాన్యుఁడు స్వార్థమునిమిత్తము గొన నిచ్ఛగింపఁడు. కాని యీసమర్పించుట మన ప్రపత్తినిఁ దెలియఁ జేయక మానదు.

తే. గీ. ఇలను గొండంత దేవర కేవఁడు గాని
మేటియంతపత్రిరిఁ బెట్టి మిడుకఁ గలఁడె
కలిగ నేనియు సర్వలోకమును జేయు
వానిదే గాక మఱియొక్కని వాని దగునె. ౪

బెల్వీ—(విజ్ఞాపనపత్రిముం బుచ్చుకొని) లోకమాన్య! మహారాష్ట్రదేశమండలిమీమిత్రకోటిలో నల్పసంఖ్యాకులమైన మే మిచ్చట షష్టిపూర్త్యుత్సవసమయంబున నేడు మాసంతోషమును వెలిబుచ్చు

టకై వచ్చి యున్నారము. ఈయుత్సాహసమయమున మిమ్ముఁ గని మీకు వందనములు చేయుటకు మా కపరిమితానంద మగుచున్నది. మహారాష్ట్రదేశచరిత్రమందుఁ గడచినముప్పదిసంవత్సరముల కాలము ముఖ్యమైనవి. ఆకాలమం దింతింత యన రాని దేశసేవ మీరు చేసి యున్నారు. న్యాయశాస్త్రాద్యున్నతపరీక్షలం దుత్తీర్ణు లయ్యు నుద్యోగపదంబునం గాలువెట్ట నెంచక దేశసేవకై మీజీవితమును వినియోగించినారు. సకలజగదేకసంస్తవనీయ మైనమీగుణసంపత్తియు సమస్తలోకమార్గదర్శకం బగుమీన్యాయప్రవర్తనంబును, అనన్యసాధ్యమైనమీస్వార్థత్యాగంబును, మహికాహార్యసదృశం బైన మీధైర్యంబును, మఱియు, ననంతంబు లైనమీయుత్తమగుణంబులును బ్రకటింపం బడుటం జేసి మీ రెల్లప్రజలకును బ్రజానాయకులకును నాదర్శకులైతిరి. దేశసేవావ్రతదీక్షం బూనుట చాలకష్టతర మైనకార్యము. మీ కిందువలనఁ గలిగినయిక్కట్టులు జ్ఞప్తికి దెచ్చుకొన్నంతమాత్రముననే యెట్టివారిమనంబునకును గల్లోలము పుట్టకమానదు. మహావిద్వాంసు లగుమీ రెవ్వరికినిఁ గలుగఁ బోనిబాధలలోఁ గలిగియుండినవారు. అట్టిమీ యరువది యొక్కటవజన్మదినోత్సవము చూచుభాగ్యమా భగవంతుఁడు మాకుఁ గలిగించి మహోపకారము చేసియున్నాఁడు. ఆషడ్గుణైశ్వర్యసంపన్నుం డైనభగవంతుఁడు దేశీయుల కెల్లకాలము నిట్లు సేవ చేయుచుండునట్లు మీకు దేహదార్ఢ్యమును జిరజీవితంబును గలుగఁ జేయుఁ గాక యని ప్రార్థించుచున్నారము.

ఈసమయమునందు రిక్తహస్తములతో మాయుత్సాహమును వెలిబుచ్చుటకు మాచిత్తంబు లంగీకరింపవు. మీరు మీజీవితకాలమంతయు స్వార్థపరిత్యాగము చేసి దేశసేవ చేసినందులకుఁ దగినపారితోషిక మొసంగుటకు మాకుఁ గా దెవ్వరికిని శక్యంబు గాదు. అట్టి పారితోషికమును లేదు. కావునఁ జందురీన కొంకనూలుపో గను

న ట్లీయలంతిపారితోషికము, ఈవిజ్ఞాపనపత్రముతోఁ గూడ మీకు సమర్పించుచు దీనిం దయాపూర్వకముగా స్వీకరింపుఁ డని హృదయ పూర్వకముగాఁ బ్రార్థించుచున్నారము. మీవంటిదేశసేవాపరాయణులు స్వలాభాపేక్ష లేనివా రగుటచే వారిఋణము తీర్చుకొనుట దేశీయులకుఁ గష్టతరము. కాని ప్రతిదేశమందును బ్రజలు విశ్వాసఘాతుకులు గాక యట్టిమీఋణముఁ దీర్చుటకుం బ్రయత్నింపవలయును. అట్లుచేయుట వారికి విధియై యున్నది. ఆచేయుట మీకొఱకుఁ గాకున్నను మహారాష్ట్ర మట్టినిందనుండి తొలంగుకొఱకుఁ గాను మీ రీచిన్నపారితోషికమును దయతో నంగీకరింతురుగాక యని ప్రార్థించుచున్నారము.

పటవ—(విజ్ఞాపనపత్రముం గొని వెండిబరిణలోఁ బెట్టి తిలకునకు సమర్పించుచున్నాఁడు. కరతాళధ్వనులు చేయుచున్నారు. పిదప మొహరీలతో నున్నపట్టుసంచియును, క్రమముగాఁ బేటికలలోనిద్రవ్యమును, అంగుళీయకములును, దుస్తులును, సమర్పించి పుష్పహారము మెడలో వైచి సాలువు మీఁదఁగప్పి జాగ సైనశిరోవేష్టనమును శిరము మీఁదఁ బెట్టుచున్నాఁడు. (కరతాళధ్వనులు. జయజయశబ్దములు నగుచున్నవి. పిమ్మట ననేకులు క్రమముగా వచ్చి సాష్టాంగనమస్కారము చేసి యంగుళీయాదిబహుమానములు చేయుచున్నారు.)

వైతాళికులు:—(ఇద్దఱు తిలకునెదుటికి వచ్చి)

స్వస్తి సమస్తసద్గుణగణాలంకారాలంకృత దివ్యమంగళవిగ్రహ విరాజితప్రభావ! చాపశాస్త్రోభయవిద్యాప్రవీణ భార్గవరామప్రశస్త యశస్త్రాల్య సమధిగతనిరర్గళకీర్తి ప్రతాప! విశృంఖలప్రచార క్రూరజనహృదయపుటభేదన పటిష్ఠశతఘ్నికాయఃపిండాయమాన మాననీయపరమపవిత్రతరాక్షరత్రితయచిహ్నితనామధేయ! కర్మబాహ్యోత్పన్న వంశ సంజనితదురాచారభూయిష్ఠ తిష్ఠన్మాత్రకులకలంకాంకురానాథ ప్రేత స్వర్లోకప్రాపకతిలకాయమాన తిలకపదధ్యానబధిరీకృతదశదిశా

వలయ! భారతమాతృకృతచిరంతన గరీయస్తరతపస్సర్వస్వభాగధేయ! నిజదేశసముద్ధరణకార్యార్థ తృణవత్పరిత్యక్త సమస్తాత్మీయా నిర్వార కార్యపరిచార! భగద్గీతార్థ సారసారస్వత సర్వంకషమనీషావిశేష బహూకృత - శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యధురంధర జగద్గురు శంకరాపరావతార! పరాక్!

రెండవవైతాళికుఁడు—మహారాజ!

శా. శ్రీరమ్యంబగునున్నతాసన మిదే సింహాసనం బీపరిజా
వారప్రాపితయోగ్యపత్రి మిది రా పట్టంబు జాంబూనద
స్ఫారౌఘం బభిషేక మీవిమలవస్త్రస్యూత ముష్ణీష మే
సారం బైనకిరీట మింకఁ గవితా సామ్రాజ్య మీవందుమా. గి

తిలకు—పూజ్యులైననాప్రియమిత్రులారా! దేశీయులారా!

సీ. మీరు నా కిపు డింత పారితోషికముగో,
యోగ్యతాపత్రము నొసఁగుకతన
మీప్రేమకుం దగు మేరగా నేను జో,
హారు లర్పించుట కనువు పడెడు
నొకు లెల్ల నాదుమ నోగత భావంబు,
సంపూర్ణముగఁ దెల్పఁ జాల కుండు
నానందసమయంబు నందగుభాష సం,
కుచితస్థితిం బొంది గొంటు ఘనును
తే. నేను నామనోభిప్రాయ కెమిపుడు మీకుఁ
దేట తెల్లంబు గావింప నోటుపడితి
నేని నన్ను మన్నింపుఁడీ మానితాత్ము
లార! యని వేఁడుకొన్నుమంటి నయ్యమిమ్ము
మఱియు నవధరింపుఁడు—

ఉ. కొంచెము కొంచెమై తుదకు గొప్పకు గొప్పగునట్లు మీర ల
ర్పించినపారితోషికము రీతినిఁ గైకొని యిప్డు కొంచెమై
యొంచఁగ నైననావచన మెల్ల భవద్విపులాంతరంగభూ
మ్యంచితమై మదీయహృదయార్థ మదంతయుఁ దెల్ప వర్థిలుక్.

నాప్రియసహోదరులారా! మీ రందఱు నింతవఱకు నాయుద్యమమునకు ననేక విధముల సాహాయ్యము చేసి యున్నారు. మీఋణము నే నెట్లు తీర్చికొందునా యని యాలోచించుచుండ వృద్ధియగు నాఋణమును నేఁడు మఱింతవృద్ధి యగునట్లు చేసినారు. ఇది మీరు నే నెప్పటికిని ఋణస్థుఁడనై యుండవలయునని మీసంకల్పమా? మీకు నాయందు నిర్వ్యాజమై గాఢమైనప్రేమ గలదనుటకు సందేహము లేదు. కాని ఇది నాప్రకృతకృత్యమును మఱింత కఠినమైనదానిఁగాఁ జేయుచున్నది. మీయాశీర్వచనమువలన మీయధికమైనవిశ్వాసమను ఋణమును దీర్చుకొనుటకు భగవంతుఁడు నాకు శక్తి నిచ్చునని నమ్ముచున్నాను. యోగ్యతాపత్రము నంగీకరించుటయందు నాలో నాకుఁ గొంతకలవరము గలిగినను దానిని మర్యాద ననుసరించి యంగీకరింపక తప్పినది కాదు. కాని మీ రొసంగినద్రవ్య మట్లు కాదు. ఈపేటికలలోనిద్రవ్యమును నేనేమి చేయవలయునో నాకుఁ దెలియదు. నాస్వలాభమున కిది యక్కఱ లేదు. దీనిని సక్రమమార్గమున దేశీయకార్యముల కుపయోగించుట కేమగడనై స్వీకరించుచున్నాను. నేను నాశక్తి కొలఁది నాద్రవ్యమును గూడ దీనికిఁ జేర్చి యుపయోగించెదను. అఱువదిసంవత్సరములు కడచిన నేను నాభవిష్యత్తును విచారింపగా మంచిస్థితి గలుగు నని నాకుఁ దోఁచుట లేదు. నామనోదృష్టి యెదుట సౌఖ్యపథము లేక సంక్షోభము గాన వచ్చుచున్నది. పరిక్షీణబలుండ నగు నేను వాని నెదుర్కొనుటకు ధైర్యము చాలని వాఁడ నగుదు నేమో యనుభీతి నాచేతంబునం బొడముచున్నది. కాని మీ

రిదివఱకు వలెనే ముందుఁ × ×ఁ జూపునట్టిసాహాయ్యముతో నే నిదివ ఱకుఁ జేసిన దేశోపకార వ్యాచో దాని నింకను నభివృద్ధి చేయుటకు నాయుర్దాయమును బలమును భగవంతుఁడు నా కొసంగు నని దృఢ ముగా నమ్ముచున్నాను. మీవిజ్ఞాపనపత్రములో నన్ను విస్తారముగాఁ బొగడి యున్న మాటలు నాకిపుడు భర్తృహరిసుభాషితమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. ఏనుండు:—

"పరగుణపరమాణూన్ పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసంత స్సంతి సంతః కియంతః"

ఈచెప్పాటవలన సత్పురుషు లెప్పుడును బరులగుణపరమాణువు లను బర్వతములుగాఁ జేసి సంతసించుచుందురఁట! అట్లే మీరును నని యెఱుంగుదురు గాక.

లోకబంధులారా! ఇది యంతయు నాయందలిసుగుణంబులం బట్టి కాక మీయుదారభావమునుబట్టి యైన దని స్పష్టమగుచున్నది. మనదేశముకొఱకు నేను జేసినకొలఁదిసేవతో మీరు సంతృప్తిని జెంది యుండ వల దని నేను మిమ్ము వినయపూర్వకముగా వేఁడుచున్నాను. నేనిదివఱకుం జేయఁ గలిగినదానికంటె నధిక మైనధైర్యమును, నుత్సాహమును, గలిగి మీ రందఱుఁ బని చేయ వలసినంతదేశీయకార్యము త్వరలోఁ జేయఁ దగినది, అత్యావసర మైనది, మహోన్నత మైనది యున్నది. అది నిలువరింపనలసినది కాదు. మనదేశమాత మనల నంద ఱను నిద్రనుండి మేల్కొని పని చేయుఁ డని పిల్చుచున్నది. ఆమెపు త్రులు మీ రెల్లరు నీపిలుపును నిరాకరించెద రని నేఁ దలంపను. మీరు మీమీభేదాభిప్రాయములను మనంబులనుండి పాఱఁద్రోలి జాతీయాదర్శములకు మీరు మూర్తీభవించినవా రగునట్లు ప్రయత్నింపుఁ డని నేను గోరుచున్నాను. మనప్రయత్నము లెల్ల సఫల మగుటకు భగవంతుఁడే మనకు సాయము చేయఁగలఁడు. మనవలనఁ గానియెడల

నీఫలము మనతరువాతివారివలననైన ననుభవింపఁ గలుగు నని నాకు దృఢమైననమ్మకము కలదు. కావున నితరవిషయము లెల్లఁ బాఱ ద్రోలి యీదేశీయకార్యములందు మన మందఱము నేకమై పని చేయ వలెను. భగవంతుఁ డీగొప్పయాదర్శమును మీమదులలోఁ బ్రతిఫలింప చేయునుగాక! మీప్రయత్నములు జయమ్ము నొందుట నాకన్నులతో నేను జూచునట్లుగా నాకు స్థితి గలిగింపు మని భగవంతునిఁ బ్రార్థించు చున్నాను. నేఁడు మీరు నాకుఁ [illegible]గొప్పగౌరవమునకు నామనః పూర్తిగా మీకు మరల మరల వందనములు సమర్పించుచున్నాను.

పటవ—దేశీయసోదరులారా! ఇపుడు తిలకమహారాజు చెప్పిన వాక్యంబు లెల్ల వేదవాక్యంబులు. ఈచెప్పినచొప్పున మన మేకగ్రీవముగా నుండి పాటుపడి దేశమాతఋణంబు తీర్చుకొనుటకుం బ్రయత్నింపవలె నని విన్నవించు చున్నాను.

కేల్కార్—నేఁ డీసభ నిర్విఘ్నముగా జరిగించినందులకుఁ బరమేశ్వరునకును, అగ్రాసనాధిపతికిని, ప్రేక్షకులకును వందనశతంబు లర్పించుచున్నాను.

తిలక—(లేచి) మిత్రులారా! మన మెల్లరముం గలసి యొక్కసారి దేశమాతం గీర్తించి పోవుదము లెండు.

అందఱు—(లేచి కలసి పాడుచున్నారు.) తెర పడుచున్నది.

ఇది నవమాంకము.

శ్రీరస్తు.

# తిలకమహారాజనాటకము.

## దశమాంకము.

బొంబాయిరాజవీధి

[దేశభక్తుఁడగు నొకగాయకుఁడు గా[illegible]సంకీర్తనము చేయుచుండు॥]

గాయకుఁడు—(తంబురా మీటుచు) రాగము-తాళము.

సీ. వినరయ్య తిలకుని । వృత్తాంత మంతయు,
వినిపింతు జనులార ! । విశదముగను
షష్టిపూర్త్యుత్సవ । సమయంబునం దిల,
కునకు సమను వచ్చెఁ । గోర్టునుండి
నీ పీనడుమఁ గొన్ని । తావులలో స్వరా,
జ్యముమీఁద నిడునుప । న్యాసములను
గలను రాజద్రోహ । మలఁతి గా దందున,
నలువదివేలీయ । వలయు మాకు
నని యున్నఁ గని యతఁ । డామూప్యముల నిచ్చి,
హైకోర్టున కపీలు । నంపుకొనియె
నట న్యాయమూర్తి దా । నంతయుఁ బరికించి,
నేరము లేదని । నిర్ణయించి
జామీనుఁ దొలఁగించి । జరిమాన రూపికల్,
వెండియు నతనికి । ప్పించి పంచె
నవ స్వారాజ్యము । నందలిస్థితిగతుల్,
దెలుపఁగ నింగ్లాండు । దేశమునకుఁ

జన నెంచి తిలకుండు తన వెంటఁ గెల్కారు,
పాలు, గపర్డి రాఁ బయనమగుచుఁ
బునహాపురమునుండి పోయి కొలంబోకు,
నవలఁ బో నాజ్ఞ లే కతఁడు మరలె
మార్గమధ్యమునందు మదరాసు బెంగులూర్,
మధుర మున్నగుచోట్ల మఱియు మఱియ
సలలితోపన్యాస ములల నిచ్చి గౌరవ,
పాత్రుఁడై పూనాకు వచ్చె నవల
సమరవిచారణ సభ చేసి బొంబాయి,
గౌర్నరు తిలకాది ఘనులఁ బిలిచి
తనయుపన్యాసంబు నను స్వరాజ్యము నిర,
సించి పల్కిన వాని నెంచ కపుడు
వ్యతిరేకముగఁ దిల కార్యుండు పలికిన,
వారించె గౌర్నరు వల దటంచుఁ
దిలకుఁడాక్షణమంద వెలలి పోయెను వెన్కఁ,
గెల్కారు గంధియుఁ గెరలి చనిరి
జిన్నా గవర్నరు చెప్పినదానిని,
ఖండించి మాటాడె గండుమిగిలి
వెనుకఁ జిరాల్దొర తనమీఁద నిందించి,
వ్రాసినదానికి వ్యాజ్యె మాడ
నింగ్లాండునకు నేగి హిందూస్వరాజ్యము,
విషయమై రాజ్యాంగవేత్తలకడ
భాసురగతి నుపన్యాసంబులుం జేసి,
పాలనాపద్ధతు లోలిఁ దెలిపి
కొన్నిలాభంబులు గొని వచ్చె మఱియును
దనచిరాల్కేసు పోయినను గాని